...GI

...DRAMA

IN FIVE ACTS

BY

**P. SREENIVASA CHARLU, B. A.**



**Madras:**

PRINTED AT THE VAIJAYANTI PRESS,

*GAY HOME, MOUNT ROAD.*

*1900.*



[*Pric. 12 As.*

శ్రీరస్తు.

# కనకాంగి.

అను నూతననాటకము.



పనప్పాకము - శ్రీనివాసాచార్యులు (బి. ఏ.,) గారిచే

రచింపఁబడినది.




చెన్నపట్టణము:

శ్రీ "వైజయంతీ" ముద్రాశాల

ముద్రితము.

1900.

Price Annas 12 only ] [Postage Extra

# PREFACE

IN writing this drama I had before me the best tragedies of the immortal Shakespeare to guide me in the development of characters. I may not have done justice to the onerous task that I set myself to accomplish, but I shall consider myself amply repaid for my pains if my readers, after perusing the work, come to the conclusion that I have striven, even in a small degree to approach that master hand in the delineation of character. If every character in my play succeeds in exciting a sympathetic throb in the hearts of my readers I shall consider myself as having won my laurels.

I feel that I cannot resist the temptation to quote the following lines of Pope :—

" 'Tis with our judgments as our watches, none
Go alike, but each believes his own.
In poets as true genius is but rare,
True taste as seldom is the critic's share;
Both must alike from heaven derive their light,
These born to judge as well as those to write.
Let such teach others who themselves excel,
And censure freely who have written well.
Authors are partial to their wit, 'tis true,
But are not critics to their judgments too?"

This drama, published so as to synchronise with the coming birth-day of our Queen, Empress of India, has, added to it with some modifications, certain verses which I composed and made public on the occasion of Her Majesty's Diamond Jubilee.

LAKESIDE, EGMORE,
Madras,
*23rd May, 1900.*

P. SREENIVASA CHARLU.



TO

THE REVERED MEMORY OF

Sreeman Vidvan Abhinava Panditaraya

# Madabhushi Venkatacharya,

MY LOVING TEACHER

"Who, as a bird each fond endearment tries
To tempt its new-fledged offspring to the skies,
Still tried each art, reproved each dull delay,
Allured to brighter worlds, and led the way."

# ఈ నాటకమున వచ్చుపాత్రములు.

---

మదనుఁడు—కథానాయకుఁడు.

ప్రతాపసేనుఁడు—మదనుని కుమారుఁడు.

విజయుఁడు—మదనుని నిక్కంపు మిత్రుఁడు.

దుర్బుద్ధి—మదనునిఁ జెఱచిన యమాత్యుఁడు.

కనకాంగి—మదనుని పట్టమహిషి.

లీలావతి—బోగముది.

రదనిక—లీలావతి చెలికత్తె.

లలిత—కనకాంగి చెలికత్తె.

ముని, శిష్యులు, భటులు, ఎఱుకమున్నగువారు.

---

శ్రీరస్తు.

శ్రీపార్థసారథయేనమః.

# కనకాంగి.

---

## నాంది.

ఉ. శ్రీకరు నెవ్వనిం గొలిచి చింతలఁ బాసి భవాంబురాశిఁ బె
జ్జోక దలిర్పఁ దాఁటి మది జొత్తిలుసంతస మెచ్చ ముక్తికాం
తా కరయుగ్మముం దిగిచి తద్గసుఖింతురు సిద్ధు లట్టియ
స్తోకగుణుండు పార్థరథసూతుఁడు సభ్యుల మిమ్ముఁ బ్రోవుతన్.

ఉ. ఏరమణీలలామ హృదయేశుమనంబుఁ గరంపఁగాఁ దదీ
యోరువిశాలవక్షమున నున్నతిఁ బొల్చును నీరదాళిలోఁ
జారుతరప్రభాపటిమ సారెఁ దళుక్కనుమించుపోల్కి నా
సారసపద్మ లక్ష్మి మిము శాశ్వతవైభవ మిచ్చి ప్రోవుతన్.

(నాంద్యంతమున.)

సూత్ర—నటీ! ఒక్కింత యిటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్య! ఇదె వచ్చితి నేమి యాజ్ఞ?

సూత్ర—మనల నెంతయుం గూరిమిఁ బరిపాలించు విక్టోరియా మహారాజ్ఞిగారి పుట్టిన దినంబు నేఁ డనుట నెఱుంగుదువా?

నటి—నే నేల యెఱుంగను? అఖిలాగమపారగులగు విప్రులస్వస్తివాచకంబులచేతను, సరససంగీతవిద్యాలోలురగు లౌకికులకీర్తనంబులచేతను, పౌరసువాసినీజనమంగళగానంబులచేతను చెన్నపురంబు నేఁడు మ్రోగుచుండ నీ శుభోదంతంబు నెఱుంగకుందునే?

సూత్ర—నీ వన్నది నిక్కము. ప్రజ లెల్లరు మనచక్రవర్తిని గారి యాయురారోగ్యాద్యభివృద్ధికై తమతమ యిలు వేల్పులఁ గొలుచు చున్నవారు.

నటి—ఇది మనరాణిగారిపుట్టినదినం బగుట మన కెల్లరకుఁ బండుగదినంబ యయ్యెం గావున నాటక ప్రారంభము నకు మునుముందు మన చక్రవర్తిని గారికిం గైవారంబు లొనరింతము.

సీ. తల్లియై సాధ్వీమతల్లియై నతసార
వల్లియై నిరతంబుఁ బ్రబ్బగడించి
రాణియై బహుకలావాణియై నతనృప
శ్రేణియై నిత్యంబు సిరులఁ బొదలి
శీలయై గుణరత్నజాలయై కరుణాల
వాలయై యేవేళఁ బరిఢవిల్లి
శాంతయై పాలితాశాంతయై నిజయశః
కాంతయై యెప్పుడు ఘనతనొంది
మనలఁ బాలించువిక్టోర్య మహితలీల
నెగడి యాచంద్రతారార్కముగ ధరిత్రి
నిందిరేశునికరుణచే నేలుఁగాత
మిట్లె మనమెల్లవేళల నెలమిఁ దేల.

సూత్ర—మేలు మేలు. నతనృపమకుటమణిరంజితపాదసరో జయైన విక్టోరియాచక్రవర్తిని కీశ్వరుండు సకలవైభవంబు లొసంగి సితయశంబు నభివృద్ధిచెందించుఁగాక.

నటి—ఇదె యీమందిరంబున గుమిగూడినవా రెల్లరు నిమ్మహోత్సవంబునకై .........

సూత్ర—ఔను. చక్కఁగ జ్ఞప్తి చేసితివి. ఇట్లానందమున నియ్యుత్సవంబునకై యీ రాజధానిం జేరిన ఘనులను రంజింప నొక్క నాటకంబుఁ బ్రయోగింపఁ దలంచితి. ఈ సభఁ గలయం జూడుము.

తే-గీ. వేదవేదాంత విదులగు విప్రవరులు,
సరసనంగీతసాహిత్యసహితు లైన
రసికులును, నీతిశాస్త్రాళి నెసక మెసఁగు
ధీరమతులును వేడ్కమైఁ జేరి రిందు.

నటి—వీరలను సంతోషింపఁజేయునట్టి నాటకం బెయ్యది?

సూత్ర—

సీ. శ్రీరుక్మిణీసక్తి శ్రీకృష్ణుఁ గృష్ణు సు
భద్రాప్తి సరిపోలి పరిఢవించు
న్యాయమార్గాసక్తి నలరాజు నలరాజు
సత్కళాపూర్తిచే సరవి గెలుచు
లలితవిద్యాలీల జలజసంభవునితో
భవునితో శ్రితరక్షఁ బసవుహూపు
భోగవైభవముల భోగీంద్రు నింద్రుని
విబుధత్వమున నోర్చి పేరుగాంచు
నంచు బుధులు వర్ణింపఁగా ననవరతము
నెసక మెసఁగు ననంతార్యు నేకపుత్రుఁ
డైన శ్రీనివాసుఁడు కనకాంగి యనెడు
నాంధ్రనాటకము రచించె నంబుజాక్షి.

దానిం బ్రయోగింపఁ దలంచి యున్నాఁడను.

నటి—ఆర్య! అనన్యసామాన్యంబగు నాటకప్రయోగ కౌశలంబుగల తమచేఁ బ్రయుక్తంబగు రూపకం బెద్దియేని సభాజనులకు ముదంబు నించుట చోద్యంబె?

సూత్ర—నేఁ డట్లనుట పోలదు.

తే-గీ. శ్రీనివాసుండు బాలుండు, వాని నాట
కంబు కనకాంగి నూత్నంబు, ఘనులు వీర
లుభయభాషాప్రవీణులు ప్రథ లభింప
వీరి మెప్పింపవలయుఁగా వెలఁదిమిన్న.

నటి—మీమాటలచే మీయూర్జవంబు తేఁటపడియెంగాని వేఱొండుగాదు. ఈ నాటకఖేలనంబుచేఁ దాము సత్కీర్తిఁ బడయుటయకాక యీ నాటకకర్తయగు శ్రీనివాసునకును యశం బొడఁగూర్పఁ దారు సమర్థులు.

సూత్ర—ఎట్లగునో చూచెదముగాని యిపుడు నాథనామక్రియరాగం బాలపించి యీ గ్రీష్మఋతువును వర్ణింపుము.

నటి— కవిరాజ విరాజితవృత్తము.

వెలువలు చల్లని నీటను గ్రుంకి * కల్వలరారఁగఁ గస్తురితో
మెలిచిన గంధ మలందిన చక్కని * మేనులతావులు గ్రమ్మఁగ శీ
తల పవనంబులు వీచెడు తావులఁ * దద్దయు భక్తిని శ్రీశునిపై
వెలమిఁ బదంబులఁ గీర్తనలుం బగ * నెత్తిత్తిఁ బాడుదు రెల్లపుడున్.

సూత్ర—మేలు మేలు. నీ రాగమూర్ఛనలకుఁ జిక్కిన నాకు నీచిఱుగంట ప్రోఁత వినదయ్యెను. అదె విజయుఁడు ప్రవేశించుచున్నాఁడు. పదపద.

(నిష్క్రమణము.)

శ్రీరస్తు.

# కనకాంగి.

---

## ప్రథమాంకము.

### ప్రథమరంగము—నృపసభా బహిః ప్రదేశము.

[ప్రవేశము: విజయుఁడు.]

---

విజయుఁడు—(తనలో) ఔరా! మదనున కెన్నఁడు బుద్ధి వచ్చునో! సన్మార్గం బధికరింపుమని పలుమారు పలికిన జనకునిమాట లొల్లక, రాజకీయ కార్యంబులయందు బుద్ధిఁ జొనుపక, పలుపోకల నపయశంబు గడించుకొని, తండ్రిమనంబును శోకాకులితం బొనరించి, దాననాతని దుర్మరణంబునకుఁ గారణభూతుండయి, తుదకు రాజ్యంబును నిజభుజంబునఁ దాల్చియుఁ దగవుతగము లెఱుంగక దుస్సహవాసంబుల మరగి లీలావతీభుజంగినిం గూడి, ప్రజలు కందఁ, బట్టమహిషి కుంద, నిందలపాలయి కాలంబుఁ గడపుచున్నాఁడుగా మదనుఁడు! కూడం జదివిన దోసంబున నే నెంతయో నయవచనంబులు దెలిపి

చూపితిఁగాని యవియన్నియు వమ్ములయ్యె. అక్కటా! మనకేల యీ వలవని కలవరమ్ము లని యూరక నా పనులు చూచుకొనుటకును నా మనం బొప్పదయ్యె. మంచికులమే! తండ్రి శ్రేయోన్వితుండే! వీని కేల యిట్టి చెడుపోకలు? వీనిసతీమణి కనకాంగి భద్రచరిత కాదే! ప్రజలకెల్లరకుఁ దల్లియై మెలఁగునట్టిదే!..... మదనా! ఆమె నిట్లు పొగిలింప నీకుఁ దగునా?..... దుష్టయగు లీలావతిం గూడి యమ్మానవతి నిట్లలయిం చుట నీకుఁ బాడియే?

తే-గీ. మానినీమణి సతి శోక మూని కనుల
బాష్ప మొలికిన రాజ్యంబు పాడుగాదె!
మదన! నీకేల దుర్బుద్ధి పొదలెనొక్కొ?
ఎఱుక నీ కిడ హరియె తా నెఱుఁగు నకట.

ఆ లీలావతి గుణంబు లిట్టి వని యెఱుంగక దానివలం దగిలి.................................

అతఁడె మదనుండు వచ్చుచున్నాఁడు. అదె వాని దుష్టపరివారంబు.

తే-గీ. చేతఁ జిక్కిన చెలువంపుఁ జిలుకకొదమ
నెగిరి పోనీక గూటిలో నెలమిఁ బెట్టి

యలరుభోయని వితమున నకట వీరు
మదను నెలయించి చెడుత్రోవ మానవీరు.

ఔను. వా రిచ్చటికే వచ్చుచున్నారు. నా మాటలు తనకు రుచింపమి నీ మదనుం డేమియాడినను దాల్మిమై నోర్చి యీతని సన్మార్గంబున కెలయించుటయె నాకుఁ గర్తవ్యంబు కావున నిందె నిలిచెద.

[సపరివారుఁడై మదనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మదనన్నృపశేఖరా! జోహారులు.

మదనుఁడు—విజయా! ఇం దేమి సేయుచున్నాఁడవు? నేఁడు ననుఁ జూడ నేల రావైతివి?

విజ—పనిపై నున్నందున రానైతిని.

మద—(నవ్వుచు) నీతిశాస్త్రపఠనంబా? సన్మార్గవిచార వైపరీత్యంబా?

విజ—(తనలో) ఔరా! మన రాజేంద్రునకుఁ బాండిత్యము ముదిరెను. దీన నీతనికి మనయందుఁ గల్గునభిప్రాయము విశదమయ్యె.

మద—విజయా! ఏల యూరక నిలిచెదవు? బదులాడ వేల? నీనయవిచారం బొక్కింత వదలుము. ఇదె మేము

లీలావతీసహితులమై వనక్రీడ కుపక్రమింపఁ బోయె
దము. మ మ్మనుగమింపుము. నేఁడు నీవు మాతోడ
వచ్చి యాలీలావతిగానం బాలించితివేని నాపికవాణిఁ
దొఱంగు మని పలుకుదువా? ప్రవీణతాక్వణిత
వీణానినాదానుకారియై చెలఁగు నా కలకంఠికలస్వ
నంబు వీనులఁ గ్రోలియు, లయకు ననుగుణంబులగు
తాళమానంబుల నొలయించునవ్విలాసినినృత్యంబును
దాని సరసాభినయంబును గన్నులారఁ గాంచియు నా
యొయ్యారి నితర వారయోషిన్మణులతోడ సరిపోల్చి
చూడుము......... విజయా! ఏల బదులాడవు?

విజ—నృపశేఖరా! నేఁడు నాకు వనకేళీలౌల్యంబును, గానా
కర్ణనాభిలాషయు, నర్తనాభినయాలోకనవాంఛయు నిసు
మంతయైన లేమిం జేసి నన్నూరక విడువుము. ఇంకొక్క
పరి నిన్ననుగమించెద. నేఁడు నను మన్నింపుము...

మద—ప్రియసఖా! అనుదినంబు నిట్లే పలుకుచున్నాఁ
డవు. నేఁ డెట్లైన రాకతప్పదు. రావేని నాయానందం
బున కొక్కింత కొఱంత వాటిల్లును. వెడలుము.
బదులాడకుము. (అని చేయిపట్టి యీడ్చును.)

విజ— (స్వగతముగ) బుద్ధిలేమిచే నితఁడు నా నయవచనంబుల నాలింపఁడుగాని యెప్పటియట్ల నాయందు నెయ్యంబుఁ బాటించుట తెల్లమయ్యె.

(ప్రకాశముగ) ధరాధిపా! నన్నూరక వదలవా?

మద—నేఁడు నిను మాత్రోడఁ గొనిపోక వదలనోప. రమ్ము.

(పట్టి యీడ్చుకొని పోవును.)

---

# కనకాంగి.

---

## ప్రథమాంకము.

---

ద్వితీయరంగము—కనకాంగి యంతఃపురము.

[ప్రవేశము—కనకాంగి.]

---

కనకాంగి—(స్వగతముగ) ఆహా! దుర్భరము. దుర్భరము. ఈ దుఃఖపాథోధిఁ దరించుట మిక్కిలి దుర్ఘటము.

ఉ. ఎవ్వరి మూఱుదాన, నిఁక నెవ్వరిసాయము వేఁడుదాన, నీ
నెవ్వగ నెట్టులోర్తు నలనీరజనాభుఁడె దిక్కుగాక! నా
కెవ్వరు రక్షకు ల్గల రహీనకులుం డితఁ డక్కటా కడున్
అవ్వలపాలుగాఁ జెడును అట్టడిదుష్టులగోష్ఠిఁ గూడుటన్,

కనకాంగి·

నా నాథుఁ డీక సన్మార్గం బవలంబించునా? సద్బుధుల నయవచనంబుల నాలించునా? దుష్టపరివారంబును వెడలఁగొట్టునా? ............ అక్కటా! తమ మాయావాగురఁ దనుం జిక్కించుకొని విజ్ఞవీగు నా పలువల నతఁడు వీడుటయా? ఇది యగునా? వారె తనకు సన్మిత్రు లని తలంచునే? ఔరా! వారు సన్మిత్రులా? దుష్టశత్రులని యెన్నఁ డెఱుంగునో? అయ్యో! ఎఱుఁగకున్నఁ దెలిపెడివారు లేరె!

తే-గీ. కూడఁ జేరినవారలు కూర్మి వీడి
ధారుణీధవుఁ జెఱపంగఁ దలఁచువారు.
దుష్టవారాంగనాలోలుఁ దొఱఁగు ననమ
టంచుఁ దెలుపంగ నొకఁడైన నకట లేఁడు.

ఇది యతని దౌర్భాగ్యము గదా! ఎవఁడైనఁ దెలుప నొకఁ డున్నను ధరణీతలేంద్రుఁడు వినునా? నెయ్యుర వలెఁ దనప్రక్కఁ దిరుగాడువారిని నమ్మిన యీతని మది నెఱుక గదురునా? తమ్ము బోయని చేఁ బడ వైవఁ దలఁచి తమదరికివచ్చు దీమంబుఁ గని తమతెగలోని పక్కియని తలఁచి నెయ్యంబునఁ మెలఁగి తుదకు నెఱుక లేమిఁ బంజరంబులం దవిలి తపించు పులుఁగు

లంబోలి యనధిగతస్వాంతు లడలుకడలిం బడుట లోక విదితంబుకాదే! నాథునిగతియు నింతయె యయ్యె. ఇఁక నే నేమిసేయుదు? వచ్చినచింతల ననుభవింపక యెట్లు దాటనగు....... ఎవ్వరిసాయంబు వేఁడుదు? అక్కటా! బుద్ధిలేక యిట్లు కలంగెద.

క. నలువ లిఖించినవ్రాఁతల
లలి నెవ్వఁడు మాన్ప నేర్చు! లాఁతుల దూఱన్
ఫల మెయ్యది! తొల్లి మెయిన్
బొలఁతులు గుడువఁగవలయును బూర్వకృతంబుల్.

*        *        *        *        *        *

ఆహా! ఎట్లు సహింతు? అందమొలుక నంబుధి నడయాడు నావ ఝంఝామారుతపాతంబునఁ ద్రోవఁదప్పి తనతల నల్లార్చుచు తరంగరింఖణాఘాతంబున నుదకమగ్నగండోపలంబుపైఁ దగిలి బలం బుడిగి ముక్కముక్కలై యవిసి మునుంగు నైఖరిఁ గొందలంబునఁ గలంగి రూపఱుహృదయంబు నెట్లోదార్పనోపుదు?

*        *        *        *        *        *        *

అక్కటా? నా జన్మంబు నిరర్థకంబు. ఈ చింతల నే మనియొత్తు? నన్ను గారాబంబునఁ బెనిచిన జనకుండు స్వర్గస్థుఁడయ్యె. నన్నుం గోడలని చూడక తన

పుత్త్రికవలె బుజ్జగించి పెంచిన నా మామయు నీభువనంబు వీడె. నా యన్నలెవ్వరును నా గోడుఁదలంపరు. ఈశ్వరుఁడు కరుణింపఁడు. నా పుట్టినయిల్లు శ్రేయోన్వితంబు. నామెట్టినయిల్లన్ననో సర్వజనపూజితంబు..........అయ్యో! నాయందు నాగోవిందునికేల యిట్టిక్రౌర్యమో? అనతరక్షకుండగు నతఁడేల యిట్లదయత నన్నీచింతాబ్ధివీచికల నలయించునో?...... ఔరా! ఈశ్వరుని దూఱనేల? నా తొలిజన్మంబున నెట్టి పాతకంబున కొడికట్టి యిట్టిశోకంబున కీ బామునఁ బాల్పడితినో!.....ఇట్టి దుఃఖభాజనంబగు మనుగడ నాకేల? ఇట్లెంతకాలం బుత్తలంబునఁ దత్తఱిల్లనోపుదు? రమణుఁడో యభ్యస్తదుష్కార్యాచరణంబుల మానఁడు. అతనికెలుకఁ గూర్ప నుద్యమించినవారో యతనికిఁ గానివారలైరి. నిక్కంపునెయ్యురతనిచేఁతలకు గోసి మోములు ముడుచుకొనిరి. అతని నీదుర్మార్గంబున కెలయించిన క్రించులో యనుంగులైరి. లెక్కలేనిబొజుంగులఁ దనమాయావిలాసంబులఁ జిక్కఁబట్టి యుక్కుమాపిన యాలీలావతియో యతనికిఁ బ్రాణేశ్వరి యయ్యె. నే నన్ననో యాఁడిగంబునకుం గొఱ

గాని బానిసనైతి. లీలావతిమాటలు రాజాజ్ఞలు. నా నుడులు హాస్యాస్పదంబులు. బొట్టుగట్టిన రాజేంద్రుని రాణీవాసంబున నే నిట్లు వరవుడనై కాలంబు గడప నేల ? ఏదేని విసముఁ దిని ప్రాణంబు విడుతునన్న నీపాడుకడుపున నొకనిసు గున్నదే! ఆత్మహత్యకు నొడం బడుదుఁగాని శిశుహత్య కెట్లొప్పుదు?......ఈగర్భ మున నప్రతిహతంబుగ నీతిమార్గంబుల రాజ్యంబేలఁ గల్గు బాలకుండు గలఁడో, తండ్రినిం బోలినవాఁడె గలఁడో యెట్లెఱుంగ నగు......అదియు నిదియుఁ గాక దుఃఖపంకిలంబగు జీవనంబున నా వలెఁ గాలంబు గడపనైన యీఁడుబిడ్డయె యున్నదో?......ఎట్లైన నాత్మహత్యతో శిశుహత్యకుం గూడఁ బాల్పడ మనం బొప్పు కున్నయది........................

నిస్సారదారునికషంబులఁ బొడమి కాననంబుల నేర్చు దవవహ్ని శిఖలం బురణించునీశోకాగ్ని జ్వాలలనీదిక్కు మాలిన తనువు దగ్ధంబైనఁ గానిమ్ము......అక్కటా! మనంబు నెంతయోదార్చిన నీమనుగడయో దుస్సహం బగుచున్నది. (కన్నీరునించి) ఎట్లు...............

[ప్రవేశము—లలిత.]

లలిత—అమ్మా! ఎప్పుడు వచ్చినను నీవాఁడు దేరినమోమునె చూడవలసి వచ్చెఁగాని నీస్మితలసితాననబింబంబుఁ గాంచు భాగ్యంబునకు నోచుకొననైతిఁగా!

కన—

ఉత్సాహ. చెనఁటినలువ వ్రాయువ్రాఁతఁ జెల్లునొక్కొ మార్పఁగన్
కనలుమనముఁ జిక్కఁబట్టఁ గలనె కోమలాంగిరో!
(నిట్టూర్చి) వనటఁ బొగులు జన్మ మిద్ది వల దటంచుఁ దలఁచినన్
మనసు రాద యసువు లెడల మందగమన విసమునన్.

లలిత—ఆహా—అమ్మా—ఎంతటి మాట లాడితివి. నీకొక్కతెకుఁ గాక యీ రాజ్యంబున మే మేల యున్నారము? ఇందిరాసతిం బోలు భద్రచరితవు నీ విందున్నంతనఁ గదా, యిండలిప్రజ లీపాడునగరంబు వీడి యెందేనిఁ బోకున్నవారు. అమ్మా! ఇట్టి చింతల నెడ మాయకుము. నీకు శుభం బతిశీఘ్రంబుగనె వచ్చును. నీ శోకంబుఁ బాపుమంటె నీ పట్టణప్రజ లెల్ల రనుదినంబును దమతమ యిలువేల్పులఁ గొలుచుచున్నవారు.

కన—లలితా! నాశోకంబు పోవంగల తఱియును వచ్చునా?

లలిత—దేవీ! వైళంబ వచ్చును......ఇప్పుడు నీ నాథునిఁ గ్రమ్మిన జాడ్య మెప్పుడు నెడదెగక నిల్చునది కాదు. స్త్రీలౌల్య మను గ్రహము పట్టి విడుచున ట్లొక్కొక్కతఱిఁ బట్టి యొక్కింత యాడించి తుదకు వీడును. లీలావతి మాయా విలాసంబుల కిప్పుడు పట్టువడియు నీ పతి శీఘ్రకాలము న నె యాదుష్టవారాంగనాసఖ్యము జలబుద్బుదాభం బని యెఱుంగును. అంతన దానిం దొఱంగును. గాధేయాదిమునిపుంగవులును మేనకాది సురవేశ్యలకుం దమతపోధనంబులను సమర్పించి తుద కెఱుకఁ దాల్చిరనఁ బ్రకృతిమనుజు లెంతటివారు? "రాత్రి తెగుదల దిన మేల రాకయుండు"నన్నట్లు లీయజ్ఞానాంధకారంబు వాయనీరమణుండు సుజ్ఞానదీపంబున సద్బుద్ధియై జనకాదిరాజసింహులఁ బోలి ప్రభుత్వంబు నెఱపువాఁడు. నామాట నమ్ముము—

కన—సకియా! నానాథున కజ్ఞానతిమిరంబు వీడునా?

తే-గీ. నృపుఁడు దుష్టులఁ గూడి తా నెపుడు నిక్క;
నా మనంబిటు వగలచే నలఁగి సొక్కఁ;
వగపొదల నాదు తనువిది పొగిలి క్రుక్క;
నకట భువిలోన నా కెన్న హరియె దిక్క.

లలిత—దేవీ! నీ విపు డన్నది నిక్కము. హరియె నీకు దిక్కు కానోపువాఁడు. నినుంబోలు సతీమణి నింకను నలయింపఁడు. దిగులు వీడుము. పొగులుఁ బోనాడుము—

కన—

తే-గీ. రాఁడు ననుఁ జూడ నెన్నఁడు రమణుఁ డకట;
వీడు సత్కీర్తిసంపద నోడ కిట్లు;
వాడుఁ బ్రజల డెందంబులు వగల నెపుడు;
గోడుఁ గుడువ నాతల వ్రాసెఁ బాడునలువ!

లలిత—అమ్మా! ఇట్టులేల పలికెదవు? చింతచే నీ కాయము ని ట్లుడికింపఁ బాడి కాదు. శోకంబు నడంచికొనుము—

కన—చెలియా! తీరస్థ ఘనవిటపి పటలోన్మూలనకృన్నదీ ప్రవాహంబు నడ్డగింప నల్ప కాష్ఠంబునకుం బలిమి కలదా! మదోచ్ఛలితశుండాదండ వేదండతండంబుల ధట్టించు చు వెరవు సృగాలం బెఱుంగునా? వారణపోతవిలోకన జనిత క్ష్వేడారవభీకరపంచాస్యంబుం బట్టి గుహ నెట్ట శునకంబు వలంతియే? ఘనకానన భస్మీకరణచణ దావాగ్నిచ్ఛటల నార్పఁ గుసుమస్రవన్మరందబిందుసందోహంబులు చాలునే? ........................

లలిత—దేవీ! ఎల్లైన నీ దుఃఖంబుల నడంచి నీయుదరం బునం బరంగు బాలునిం బ్రోవవలయు.

కన—లలితా—లలితా—ఈ గర్భముగదా నన్నే పనికిని జొఱనీయక యలంచుచున్నది. (అని కన్నీరువిడుచును.)

లలిత—అమ్మా! ఇట్లు వగవకుము. నీకువగలడఁగు నదను దఱిసె.

ఉ. తల్లికిఁ దొట్టినట్టి వగఁ దాఁ దొలఁగింపను బుట్టి శౌర్య సం
పల్లలితుండుగా నగు సుపర్ణునిఁ బోలినపుత్త్రుఁ గాంచి నీ
వెల్లవగ ల్దొలంగి ప్రజ లెల్లరు సంతస మందఁ బూజ్యవై
చల్లఁగ నాథుఁ గూడి యిల సద్యశ మొందెద వింకఁ గోమలీ

కన—చెలియా!

ఉ. వచ్చునె యట్టికాల మిఁక! వంతలఁ బాయుదునే! మనోహరుఁ
డొచ్చెములేని వర్తనల నొప్పునె! సత్సుతుఁ డిట్టియార్తకుఁ
గ్రచ్చఱఁ బుట్టునే! మగుడఁ గాంతుఁడు నేనును గూర్మిమీఱఁగా
నెచ్చెలుసంతసం బొదవ నెన్నఁడుఁ బాయక కూడియుందుమే.

లలితా! నే నింతకు నోచికొని యుందునా? నా పురాకృతసుకృతపరిపాకంబునం గాని యీ యానందంబు నాకు లభించునా? పురాకృత సుకృత పరిపాకమా సుకృతపరిపాకమా! కృతపరిపాకమా? పరిపాకమా పాకమా?

మ. పడఁతీ యేమని యాడుదాన! మదిలో భావింప నేపాపముల్
కడఁకన్ జేసినదాన ధాత వగలన్ గాఱింపఁగా నెన్నెనో!
కుడువంగాఁ దగుఁగాదె పూర్వకృతముల్! గోవిందుఁడున్ప్రీతి మైఁ
గడగంట న్ననుఁ జూచి తా సదయుఁడై కావంగ భావించునో.

తే-గీ. కాక నిర్దయుఁడై పొగు ల్గాంచు మంచు
నెపుడు వగలచే నలయింప నెన్నునొక్కొ!
ఎట్లు సైఁతును బైపయి నిట్లు పొఱలి
పొంగు చింతోర్మికల నయ్యొ పువ్వుబోఁడి!

లలిత—అమ్మా! నా మాటలను నమ్మి నీ మనంబు నోదార్పవు గదా!

కన—

క. ఎడలె యశంబును, ప్రజలున్
బడలిరి, న్యాయంబు లడఁగెఁ, బ్రాభవ ముడిగెన్,
గడుకొని వైరులు నవ్వఁగఁ
దొడఁగిరి, మన మెరియ బొక్కెఁ-తోయజ నేత్రా!

సత్కులసంజాతుండగు నాధుని చేఁతలకు రోసి చింతిల్లుదునా; సితకీర్తి పొలివోవ నపయశంబభివర్ధిల్లుటకుఁ బొగులుదునా; ప్రజలు సౌఖ్యంబెడలి పలుదెఱంగులఁ బతిని దూఱుటకు శోకింతునా; రాజ్యంబిట్లు పాడగుటకుఁ బరితపింతునా...నాకొనఁగూడిన యడలువాఁక

దరి గందునా?...... చెలియా! నిక్కంబుఁ బలికెద. వినుము. ఈ దుఃఖభాజనంబగు జన్మంబు దుస్సహంబు. నా వైరులకేని నియ్యది వలదు వలదు............

లలిత—దేవీ! ఉపశమిల్లుము. నైశంబ..............

కన—లలితా! ఎట్లుపశమిల్లుదు?

ఉ. అక్కట! లోకపాలకసమంచితభూరివిభూతియుక్తుఁడై
దిక్కుల నాత్మకీర్తిరుచిదీపితముల్గను జేయ కిట్టిలీ
వెక్కసమైన చర్యఁగొని వీగుల సంతతమాననీయులన్
బెక్కురఁ గ్రిందొనర్పఁగద బేలతనంబున నాథుఁడయ్యయో.

చెలియా! ఇది యొక్కటియె చాలదా? సుధీవరేణ్యులగు సమాత్యులును, సత్వసంపన్నులగు శూరులును హతాశులైరేని రాజకార్యంబు లెట్లు నెఱవేఱును? వీరి బలిమిచేఁ గదా నా మామ ప్రభుత్వంబు నెఱపెను? నానాథుఁడో వీరలఁ బరిభవింపఁ దలఁకొనె......... ఇంతియు కాదు. చూడుము.

ఉ. జంకక దుష్టవారసుల సంతతముం గుమిగూర్చి యాడుచున్
బొంకము వీడి సత్పుపభూషితమార్గము మాని యిట్టులీ
మంకుతనంబులన్ యశము మానముఁబాసి విటాంగనారతిన్
గొంకకదూషితుండగుచుఁ గ్రుమ్మరుఁగాదె సరోజలోచనా

అక్కటా! అట్లు నెయ్యురై చేరినవారు తమలాభంబుఁ దలంచి నృపుని వశ్యమొనర్చుకొనఁ దలపోసి యాలీలావతి నితనికిఁ గూర్చి... లలితా! తలఁపఁదలఁప మనంబడలఁ బలుకుటకును నోరు రాకున్నది.

లలిత—దేవీ! పలవింపకుము. నీకు మేలు గలుగు కాలము వచ్చెను. నీపతిం గ్రమ్మిన యజ్ఞానతిమిరంబు తిరముగ నుండ నోపదు...............................

కన—

ఉ. తరుణి యితండు వారవనితాయుతుఁడై యరదంబు నెక్కి తె
న్నరయక యెల్లెడల్ దిరుగు నార్యవినిందితమార్గగామియై
పరసుజనాపరాధ పరిపక్వసుధీయుతుఁ డౌచు; నే క్రియన్
బోరయుడు నెమ్మి! కేశవుఁడు భూరిదయాపరుఁ డౌనె చెప్పుమా!

లలిత—కరివరదునకుఁ గరుణయె భూషణంబనుట వినవా?

కన—లలితా! పాతకిని నగునాయం దతఁడు కరుణించునో కరుణింపఁడో యను శంక పొడముచున్నది.

క. కలఁడు కలండను నీశుఁడు
కలఁడో నాపాల లేఁడొ కడు సంశయము
య్యె లతాంగీ!

లలిత— నీవగలన్
దోలఁచుచుఁ గలఁడని తెలుపును దోడనె తరుణీ.

నీకుఁ జేకూరిన శోకమునకు...................

కన—
కవిరాజవిరాజితము.
అదయత ధాత లిఖించిన వ్రాఁతల
నక్కట మార్పఁగ నేరికి నాఁ!
బదరఁగ నేలొకో యీఁగతి నాతోలి
బాముస నేక్రియ నాడితినో!

లలిత—
పొదలును సంతస మూరక నమ్ముము;
పోలునె చింతలఁ గుందఁగ! నీ
కెద నిఁక నాథుఁడు గూర్చును మోదము;
లీశ్వరుఁ డొక్కఁడు లేఁడె సతీ!

దేవీ! లెమ్ము. ఇలువేల్పుఁ గొలువఁ దగువేళ వచ్చె.

(లేపి)

ఆ-వె. సాధ్వివైన నిన్ను శౌరి తాఁ బ్రోవంగఁ
దలఁపఁ డొక్కొ! చెలియ తల్లడంబు
వీడి పార్థసచివు నోడక భక్తిమైఁ
గొలువు మెల్లవగలుఁ దొలఁగి చనును.

(ఇరువురును నిష్క్రమించెదరు.)

---

# క న కాం గి

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము—అడవి.

[ప్రవేశము—విజయుఁడు.]

విజయుఁడు—(స్వగతముగ)

చ. ఇనుఁ డపరాంబుధి న్మునుఁగ నేపున నంధతమంబు ధారుణిన్
బనుపడి క్రమ్మున ట్లకట ప్రబ్బెను దుష్టులచెయ్దము ; ల్వినూ
తనగతిఁ గ్రూరకృత్యములఁ దాఁ దలపోసె నితండు ; వారకాం
తను దనకార్యము ల్నెరపఁ దద్దయు రేఁపును గాదె వాఁ డిటుల్ !

*        *        *        *        *        *        *

ఔరా దుర్బుద్ధీ! సత్కులంబునఁ బుట్టినం గదా నీకు సన్మార్గం బలవడును. చిఱుతనాటనుండియు జూదరుల తోడను, మద్యపాయుల సహవాసంబునను, ఆటచేడియల కూడికలను, ఇంచుకయేనిఁ గరుణాలేని ఘాతుకుల నెయ్యంబునను గాలంబుఁ గడపిన నీ కిట్టి బుద్ధి

పుట్టుట చోద్యంబుగాదు. నీవు పుట్టినప్పుడె నీ జాతకము గుణించి యందుఁ దేటపడిన నీభావిచర్యల నెఱింగియె నీ జననీజనకులు దుర్బుద్ధియను నన్వర్థనామధేయంబు నీకిడి రంచుఁ దలంచెద. ఔరా! ఈలీలావతి కారణంబున దంపతుల నెడఁబాపినంతనె సంతసింపక యిట్టి క్రూరకృత్యంబున కొడి కట్టితే? అక్కటా! మదనుని శ్రేయోభివృద్ధి నభిలషించు నమాత్యు లత నికిఁ గానివారలైరి.........బోయం డుక్కివంబునఁ దనపన్ని నవలం బక్షులఁ జిక్కించుకొనునట్టు లీ విష్ణుహీథవు నీ మాయావాగురం దగులు పఱచుకొంటివి. నిక్కం బెఱుంగక యవనీధవుండు నిన్నుం దనవానింగ నమ్మి నిజజాయం బరిత్యజించి గోముఖవ్యాఘ్రియగు నా లీలావతివీక్షణాశుగంబులం దవిలి, విషప్రాయంబులయ్యుఁ గైతవసుధాధారలఁ బోలు నీదుర్ణయ వచనంబులకుఁ బట్టువడి మముఁ బోలు చిఱుతనాటి నెయ్యురమాటలను వీనులం గ్రోలకయ కట్టిఁడియై మట్టుమీఱువాఁడు. అంతన తనియక జగదంబఁ బోలు నక్కనకాంగిదేవిని గెడపఁ దలంచి యాదుష్టయగు లీలావతి నికార్యంబునకుఁ బెరరేఁచెదేః....

సీ. ప్రజల నెల్లర నిజప్రజలుగాఁ దలపోయు
ప్రభువ్వ కేపాటి యాపదలు వచ్చెఁ!
బద్ధాత్ము నెప్పుడు భక్తిమైఁ గొల్చు సు
శీలకు నేపాటి సిలుగు వచ్చెఁ!
గలనైన భటులను గారింప నెన్నని
కాంత కేపాటి శోకంబు వచ్చె!
దిక్కుఁ గాంచక యిట్లు పొక్కుమానిని కెట్టి
తాళఁగాఁ జాలని దగలు వచ్చె!
నకట యివి చాల వంచు నీవెకలు రిట్లు
విసముఁ జేఁబూని దౌష్ట్యంబు లెసఁగఁ గ్రూర
కృత్యములకుఁ దొడఁగువారు; కేశవుండె
దిక్కుగావుత సాధ్వికి దినదినంబు!

దుర్బుద్ధీ! నాకనుల నీవు మచ్చుఁజల్లితివని తలఁచెదేమొ! లేదు. లేదు. నీదురుద్యమంబుల నెల్ల నెఱుంగుదు. లీలావతి యూడిగంపుఁ జెలియగు మాలతి నీవాలకం బిట్టిదని తెలుప నెఱింగితిఁ గాదే. నీకొక్కనికిఁ దక్కనిక్కార్యం బేరికైన సరియనితోఁచునే? చిరకాలంబుగ నీతోడ సఖ్యంబు నెఱపిన యా లీలావతి యొక్కతె నీ మాటలకు వల్లే యనఁ బోలు........తే నెపూసిన కత్తు లని మిమ్మెఱింగినదాన నా మాలతి మీ మంత నంబుల నప్రమత్తతఁ బొంచి విని నాకుం దెలుపునది.

రాజేంద్రుని కారుణ్యసుధాధారలచే సేచితంబైన మీ మనఃప్రదేశంబుల నురుద్యమంబులను విత్తనంబులు మొలకలెత్తి పెరిఁగి వృక్షంబులై నలుగడల నావరింపఁ గల్గు శాఖావితతిఁ బ్రబ్బి యిట్టి విషఫలంబుల నొసంగ నయ్యెఁగా! ఆహా! ఇదెంతటి యభివృద్ధి? భూజాత పటలిఁ గ్రిక్కిఱిసియుకాంతారంబు తద్దారునికషసం జనితవహ్నిస్ఫులింగరోచిర్జాలంబులనె నీఱై మంటఁ గలయు నంట నెఱుంగరే?......................

తే-గీ. మదను సన్మార్గగామిఁగా మార్పఁ దలఁచి
నట్టి నా యందుఁ గినిసె నాయధమగుణుఁడు;
దానఁ జింతిల్లఁ గాని యీ తగనిపనికిఁ
బూనె నింక నూరకయుండఁ బోలు నొక్కొ.

*　　*　　*　　*　　*　　*　　*

ఔరా! దుర్బుద్ధీ! బాల్యంబుమొదలు మదనుని యభివృద్ధి వాంఛించిన నాయం దసువు లున్నంతవఱకు మీ మంతనంబులు కొనసాగునా? ఇట్టి మీ పూనిక నెఱింగియు నింక నూరకయుండునా? అగునది కానిమ్ము. మీ దుష్కార్యంబులకు మీరు దొడంగుఁడు. కనకాంగీమహిషి మీ కట్టిఁడితలంపుల నెట్టి కీడును

బొరయక, నికషనికషంబున రతనంబు రుచి మించు చందంబున, యశోఽన్విత యై పొలుచునట్లొనరించెద. నీ దుష్బుద్ధి నీకు సాయం బగున ట్లశరణశరణ్యుం డగు నిందిరావరుండు నా కియ్యుద్యమంబునఁ దో డగు వాఁడు. లీలావతీసహితుండవై నీవీరాజ్యంబు వీడు నంతదనుక నేను నెమ్మిఁ జరింప నోప—ఇంకఁ గన కాంగిదేవిం బ్రోచుట నాపని. ఇందు ధర్మాధర్మపథం బుల బలాబలంబులఁ బరీక్షింపఁ గడంగువాఁడ. సత్కా ర్యంబె భువిని జిరకాలంబు నిలుచునంచును దుర్ణయం బతిశీఘ్రంబునఁ దత్ఫలంబును గుడుపుననియు శ్రుతి స్మృతీతిహాసంబు లనెడునుడు లనృతంబులే? ఇంకెంత కాలం బిమ్మదనుం డజ్ఞానతిమిరంబునఁ గన్నులుగానక యిట్లు చరింప నోపు?

* * * * * * *

దుష్బుద్ధీ! లీలావతీ! మీ కోర్కులు కొనసాగ నేరవు? మీ దుష్కార్యంబులు తుదముట్టవు. ఈశ్వరుని సాయంబునఁ గనకాంగిదేవిని నేను బ్రోచువాఁడ. అయ్యన్నులమిన్న మీసేఁతల నే కీడుం బొరయనేరదు. దుర్బుద్ధీ! నీ..............................

[భటుని ప్రవేశము.]

ఓరీ! ఏల యిటు వచ్చితివి? రాజేంద్రుఁ డేమి సేయు చున్నాఁడు?

భటు—రాజు మిమ్ముం బిలువఁ బంపె...............

విజ—(కోపముతో) నృపుఁ డేమి సేయుచున్నాఁడు?

భటు—అదె యొక్క లతాకుటీరంబున లీలావతీ సహితుఁడై ........................................

విజ—సరి. ఇదె వచ్చె నను ము. పొమ్ము.

(భటుఁడు వెడలును.)

విజ—అక్కటా! ఒక లతాకుడుంగంబునఁ దనదుష్పరివారంబుతో లీలావతీసహితుఁడై కొలువున్నవాఁ డఁట మదనుఁడు. అతని చెడునడత లింత ముదిరిన వెనుక నా యుద్యమంబులు కొనసాగునా? అతని నిఁక సన్మార్గంబున కెలయింప నోపుదునా?........

....

తే-గీ. చిట్టిరెమ్మను వంచిన నట్టె వంగు;
నట్లు గొప్పచెట్టును వంప నౌనె! ధారు
ణీశుఁ డతి నింద్యవర్తన నెపుడుఁ బొఱల
.... నెట్లు త్రిప్పుదు సద్గతి కింక నకట!

ఐన నిట్లు శంకించి విడువం దగదు. ఎట్లైన నా శక్తి కొలంది బాటువడుటయె కర్తవ్యంబు. గోపాలకృష్ణుం డీకార్యంబున నన్ను ధీబలయుతుండుగాఁ జేయుత... ఇప్పుడె మదనుండు నన్నుఁ బిలుచుచున్నవాఁడు. నే నేల యతనియాజ్ఞ నెఱపవలయు? వైశమ యియ్యడవి వీడి నగరంబుఁ జేరి కనకాంగీదేవి కీసడిఁదెలిపి....వలదు వలదు. ఏది చేసినను దత్సాధ్వికిఁ దెలుపక యే యొన రింపవలయు. తెలిపిన నున్న చింత యధిక మగును... ఐనఁ—బట్టణంబు—చాయఁ— దిరుగుదునా ? ... అది తగదు. రాజేంద్రునితోడనే తిరుగవలయు.... ఇప్పుడు మదనుని పిలుపు నిరాకరించితినేని దుర్బుద్ధి నా చర్యకు శంకించి.........ఏమి సేయును? చేసిన దానికంటె నెక్కువ యేమి సేయఁగలఁడు?........ (ఆలోచించి)...........ఎట్లైన నిప్పుడు రాజుం గలసి కొనుటయె యుక్తము........................ అతనికి వీరి మరుద్యమంబులఁ దెలిపి జాగ్రత్తపడుమని పలుకుదునా?...పలికిన నేమి సేయును? నామాటలను నమ్మునా?......నమ్మఁడు......నమ్మఁడు..........

ఎట్లు నమ్మును........కన్నులున్నఁ గదా యెఱుంగుటకు.....బుద్ధియున్నఁ గదా తెలిసికొనుటకు...మది రామత్తుఁ డజ్ఞానంబునఁ దెన్నెఱుఁగక తడబడి యొక చక్కిఁ గూలునట్లు..............................

[భటుని పునఃప్రవేశము.]

భటు—తమ్ముఁ బిలువలేదని రాజేంద్రుఁడు నాపైఁ గినియుచు....................................

విజ—ఇదె నిన్ననుగమించెదను రమ్ము.

(అని వెడలును.)

---

# కనకాంగి.

---

## ద్వితీయరంగము.

[వనము:]

[ప్రవేశము: లీలావతి, మదనుఁడు, దుర్బుద్ధి, పరివారము.]

లీలావతి—(వీణె వాయించుచుఁ బాడును.)

సుగంధి. నిన్నె నమ్మి వచ్చినట్టి * నీరజాక్షిఁ బ్రోవరా
అన్నుమిన్న నిన్నె కోరె * నాదరింప వేలరా
కన్నె భావజుండు నొంపఁ * గందెరా ధరావరా
చన్నె బాల నిట్లు వీడ * సారసాక్ష చూడరా.

మద—ఔరా! గానసంపత్తి! దుర్బుద్ధీ! ఏల యంతదూర మున నున్నాఁడవు? ఇటు దాఁపున రమ్ము. లీలావతీ! నా మనం బానందకందళితం బయ్యె. ఇదె యీ ముక్తాహారంబు నందుకొమ్ము. (దుర్బుద్ధి తీసికొనఁబోవును) వలదు వలదు. నేన నా చేతులార నిచ్చెదను. లీలావతీ దీనిం గైకొనుము. ఇదికాదు—ఇంక దీనింబోలిన పది హారములనేని నీకొసంగనగును.

లీలా—(హారమును దీసికొని మెడం దవిలించికొనుచు) దీన నీకు నాయందుఁగల్గు గారవము సంసూచితం బగుచున్నది.

మద—

తే-గీ. చెలియ నీపాటచే నాదు చిత్త మపుడె
నన్ను విడి నిన్నె చేరెను—

లీలా— నాకుఁ జూడ

నిదియె పదివేలు, హారంబు లేల! సొమ్ము
లేల! నీ మక్కువ యొకటె చాలు నధిప.

దుర్బు—(మెల్లన లీలావతితో) మందు తలకెక్కుచున్నది. (ప్రకాశముగ) లీలావతీ! రాజేంద్రుఁడు నిక్కంబు పలికెను. ఇట్టి రసజ్ఞుని కూడికచే నీవు మేలి కుందనం

బునం బొలుచు రతనంబన శోభిల్లెదవు. మఱియొక్క-
పాట పాడుము.

మద—సఖా! లీలావతి యొక్కింత యలసటఁ దీర్చుకొని
పాడనిమ్ము. లీలావతి! ఇదె చూచితివా? నీబడలికయుఁ
దలపోయక నిన్నింకను బాడఁ బురికొల్పెదము.

లీలా—నృపవర్యా! ని న్నానందాంబుధి ముంచుటకన్న
నాకుఁ గర్తవ్యం బేమున్నది. నీయాజ్ఞఁ దలమోసి—

మద—చిలుకలకొలికీ! అది కాదు. గాణలబడలిక నెన్నక
తమతమ యానందంబులనె తలపోయుట సంగీతలో
లురకుఁ గల్గు క్రూరత.

లీలా—వసుమతీశ! ఇంతయేల? ఇదె పాడెదను (వీణె
మీటుచుఁ బాడుచున్నది.)

మత్తకోకిల.

సుందరాంగిర, నిన్ను నమ్మెర, * చూడరా దయఁ బ్రోవరా,
ఇందు బింబము గెల్చు మోమురా, * యింపు గుల్కెడు హాసురా,
మందయానర, పైఁడి తున్కర, * మారు ముల్కిర, బాలరా,
డెందమీయర, కౌఁగిలింపర, * శీవి నంగజు గెల్వరా.

మద—దుర్బుద్ధీ! (లీలావతిం జూపి) ఇది మత్తకోకిల. (లీలా
వతి యొయ్యారంబునఁ జిఱునవ్వు నవ్వును. దుర్బుద్ధి
పెద్దపెట్టున నవ్వును.)

దుర్బు—లీలావతీ! నీ భాగ్య మే మందును? నినుఁ బోలు కంబుకంఠు లెందఱో మదనసార్వభౌమునిఁ జేర నువ్విళులూరుచుండ నీవు—

లీలా—దుర్బుద్ధీ! నా భాగ్యమున కేమి కొఱఁత? ననుఁ బోలు ధన్య లిం కెవ్వరు గలరు? నా నోచిన నోములు విఫలంబు లగునె?

ఉ. చక్కనివాని శౌర్యరససారముఁ గల్గిన వానిఁ గూర్మిమై
మక్కువఁ జూపువాని నృపమానిత వైభవుఁడైన వాని నిం
పెక్కిన సద్గుణం బలర నెల్లరిఁ బ్రోచెడువానిఁ గాంతునిన్
దక్కఁగఁ జేసికొంట సుకృతంబునఁ గాని యిఁకెట్టు లౌ నిలన్.

రాజేంద్రా! ఇంకొక్క పాటఁ బాడెదను వినుము.

దుర్బు—ఓహో! దానికే యుత్సాహము పుట్టెను.

మద—విని యానందించు వా రున్నఁ గదా గానాల కుత్సాహము పుట్టును.

దుర్బు—విజయుఁ డున్న—

మద—(విననియట్లు) లీలావతీ! పాడుము.

లీలా— (హరిణగతి రగడ.)

కరుణ లేద * కాంతమీఁదఁ

బరుస మేల * భవ్యశీల.

మదనుచుల్కి * గ్రమంది నిన్నుఁ
బదరి చేయు * పడఁతిఁ జూడు;
మందకర్త్రై * నధిప వీడ
నంద మూనె * యరసి చూడ!
మోడి వీడి * ముదితఁ గూడ
నోడె దేల! * యుర్వి నిట్టి
కలికి నీకుఁ * గౌఁగిలింప
గలుగునొక్కొ! * కలఁక యేల!
ఇదియ నీకు * నింపుఁ గూర్చుఁ
గదర; బాలఁ * గవయ వేల!

దుర్బు—

తే-గీ. కోకిలాలాపముల గెల్చి, కొదమచిల్క
పలుకులను మించి, వీణియ నెలమి ముంచి,
చెవుల నానందమును నించి చెలఁగు నీక
లస్వరంబుల నేబాల లలి గడించు!

మద—లీలావతి! దుర్బుద్ధిమాట నిక్కము. నీ గళస్వనం
బునకు నుపమానము లేవియు దొరకకున్నవి.

సీ. చెప్పినమాటనె చిల్కచిల్కలపల్కు
సరిపోలఁదగునొక్కొ సరసిజాక్షి!
ఒక్కొకవేళల నొగి మూగయౌ కోయి
లనుడులు సరియౌనె వనరుహాస్య!

ఒరులు మీటినఁ గాని యొనరఁ మ్రోఁగని వీణె
యమెలుంగు పోలునె యబ్జపాణి!
అలకృష్ణుచేతనె ములరి పల్కునవేణు
రవ ముపమించునే భ్రమరచికుర!
ఔర శారీర సంపత్తి! యహహా గాన
రసము! భళిర! నా హృదయము రసమె యయ్యెఁ!
చెవులు నానందమునఁ బొంగెఁ! జెలిమి దీని
కకట పట్టువడనివాఁడె వెకలి యగును.

లీలా—పృథివీపతీ! నీ పొగడిక కానంద మొందితిని. నీకు నాయందుఁ గల్గు మచ్చికచే నిట్లాడెదవు గాని మఱి యొండు గాదు.

మద—ఏల యిట్లాడెదవు?

లీలా—పురుషుల స్వభావం బెఱింగిన దాననగుట నిట్లంటిని.

క. ఒక్కతెపై మచ్చికఁగొని
యొక్కతెఁ గౌఁగిటఁ బొదువుచు నొక్కతె నుడులన్
జిక్కఁగఁ జేయుచు మగవా
రక్కట చంచలు రగుటయు నసుదే యిలలోన్?

మద—లీలావతీ! నా స్వభావం బెఱింగిన నీకిట్లు పలుకుట తగునా? నిక్కంబు పలికెద వినుము. నినుఁ బోలు వనిత యొందును గనుపట్టదు. రతియు నీకు........

లీలా—నను వర్ణింప వలదు. ఇట్టి వర్ణనల నెఱుంగుదు.

చ. పురుషులు మచ్చికల్ని గుడఁ బొల్తుక నొక్కతెఁ గాంచి నిన్ను నే
తరుణియుఁ బోల దంచు నని, తద్దయు నింకొక కాంతఁ గాంచి యీ
ధర రతి నీవె నాఁ బలికి తథ్యముఁ దెల్పక చంచలాత్ములై
గరితల వంచనం గపసి కామిత మొంది కలంచి వీడరే.

మద—నీ గానము వినినంతనె చేకూరిన నా యానందము
నేల యిట్లు కొఱఁతపఱిచెదవు?

లీలా—నేఁడు నా పాటకు నానందించి ననుం బొగడెదవు.
రేపు నీ వెవ్వరిగానమునకుఁ బట్టుపడి నన్ను నుఱతు
వో యని—

మద—ఇట్లు పాడి నన్నలరించు వా రెందుం గలుగరు.

లీలా—ఐన ననుపమ గానవిద్యాకుశలిని నేనొక్కతెనా?

మద—గానవిద్యా కౌశలంబును, సౌందర్య విభవంబును,
యౌవన లీలావిలాసంబును, ఒక్కటన కలుగవలయుఁ
గాదే?

లీలా—ఇన్నిగుణంబులును గలిగి ననుం గెలుచుసుందరు
లెందరో యుండవచ్చు.

దుర్బు—ఐన నొక్కటి గదా;

తే-గీ. సురభి శారణ్య సుమములు సుచిరాంగి
కొప్పునను జేరఁ జాలక యొప్పనట్టు

లెంపటో సుందరులు నృపుఁ జెందలేక
కంది తమజవ్వనంబును గడపువారు.

లీలా—అది నిక్కము.

మన్మ—మదనమహీధవుఁ జేర నువ్విళులూరియు నెంత
టో జవ్వనులు తమవాంఛితంబులఁ బొందనేరక వన్య
కుసుమంబులు భానుమయూఖంబుల వాడున ట్లనంగ
తాపంబులఁ గంది జవ్వనంబు జాఱఁ బరితపించెదరు.
నీనోచిన నోములు సఫలంబు లగుట ననితరయువతీ
జనసులభంబగు పదవిని గడించుకొంటివి. దీనికి సంశ
యము లేదు. మిన్నొఱయు శిఖరిశిఖరంబున నిలిచిన
వాఁడు పురుగులం బోలి సానుతలంబుల నడయాడు
వారిం గనుచందంబునఁ బెఱయన్నులఁ జూచుచు
నవ్వుటయె నీకుఁ గర్తవ్యము.

లీలా—ఇఁక నట్లే చరించెదను. నృపసార్వభౌమా......

మద—అహా! ఎంత పెద్దపేరు!

లీలా—మఱి యెట్లు పిలుతును?

మద—ప్రాణేశ్వరీ! "నాథా" యని పిలువుము. లేదేని
"ప్రాణనాథా" యనుము.

లీలా—(తలవంచుకొని) ఆ పేరుపెట్టి పిలువ నేను నోచి
కొననైతి.

మద—అది యేల?

లీలా—

తే-గీ. బొట్టుఁ గట్టిన భార్య తాఁ బోలుపు మిగుల
నకట నే నెంత వలచిన నధిప నిన్ను
"నాథ" యని పిల్చు చన వది నాకుఁ గల్గు
నోకొ? తగనియాశలఁ గోర నొప్పునోకొ.

మద—ఏల యిట్లాడెదవు?

ఉ. కన్నుల కెప్పు డల్లెపుడు గారవ మొప్పఁగ నిన్నుఁ గాంచు న
న్నెన్నఁగ నీవు "నాథ"యన నెవ్వరు కాదనువారు కోమలీ!

లీలా—

మన్నన నీవు న న్నెపుడు మానవనాయక గారవించినన్
గన్నులు గాన కే నెటులు "గాంత"యటంచును నిన్నుఁ బిల్వనా!

మద—నీకు బుద్ధి తలఁగెను.

క. సుందరి! నిను సతికంటెను
డెందంబున గారవించి కీవిని నేనా
నందంబునఁ గౌఁగిటఁ గొను
చందము మఱచితె?

లీలా— మఱవఁగ సాధ్యమె నాకున్?

మద—అట్లు మఱవవేని యిట్లేల.................

[విజయుఁడు ప్రవేశించును.]

మద—మిత్రమా! మము నీయడవి దిగనాడి నగరంబున కేగితివని తలంచితిని. ఇంత దనుక నీ వెందు డాఁగితివి?

విజ—రాజేంద్రా! ఇప్పని ననతిదూరంబున నొకకిరాతుండు వలం బన్ని పలుపులుఁగులఁ జిక్కంబట్టి పంజరంబులఁ బెట్టుకొని వెడల వాగురంబడక స్వచ్ఛందవృత్తి మింట నెగురు నీడజంబు లాపంజరస్థవిహంగంబుల నీక్షించి కొండలంబున నాబోయనిం జుట్టుకొని పలు తెఱంగుల యెలుంగుల దిక్కులు మాఱుమ్రోయ నెగిరి వెన్నాడుటఁ గాంచి యొక్కింత నిల్చితి. అంత...

దుష్ట—విజయా! కాననంబులం బక్కులు కూయుచు నెగురుట యొకవింతయా?

విజ—(వినని యట్లు రాజేంద్రుం గాంచి,)

ఉ. బోయని చేతఁబట్టువడి పొక్కు ఖగంబులఁ గాంచి కుందుచున్
బాయక వెంట నంటి తమబాసల నల్లకిరాతు దూఱుచున్
బోయెడు పక్షులన్ గనఁగ భూరి వివేకముకల్మి నీభువిన్
మాయల నెప్పుడున్ మెలఁగు మానవజన్మము నీచమౌఁ గదే.

దుష్ట—ఎట్టిబుద్ధి స్ఫురణ!

మద—విజయా! నీవు సన్న్యాసివి కాఁదగు వాఁడవు.

విజ—రాజేంద్రా! అదియు నొకవేళ నాకుఁ బొసఁగినం బొసంగును.

మద—నెచ్చెలీ! ఇంక నేమి విశేషముఁ గాంచితివి?

విజ—ఇంకేమియును లేదు.

తే-గీ. అడవిఁ దిరుగాడు పక్కుల యెడఁదఁ బోలుచు
కరుణ యైనను దాల్పక కఠిన హృదయు
లగుచు జను లిట్లు మెలఁగుదు రకట యంచు
నెమ్మి కలఁగ నా చక్కినె నిలిచినాఁడ.

మద—విజయా! చూచితివా కాననంబునను నీ నయ విచారంబులకుఁ దగునంశోములు దొరకు చున్నవి.

విజ—ధరాతలేంద్రా!

తే-గీ. ఈశ్వరుని సృష్టిలో నెపు డెందుఁ జూడ
బుద్ధిఁ గలవాని కెంతయు వృద్ధిపొందు
జ్ఞాన మెఱుక లేని జడు లజ్ఞానమునను
దెలివిఁ దాల్పక తమ త్రోవ మెలఁగువారు.

దుర్బు—(తనలో) ఈ దుష్టుఁడు మనల నెత్తిపొడుచుచు న్నాఁడు. మదనుఁడు మూఢుఁడై యితని వారింప కున్నాఁడు. క్రమక్రమముగ వీని దుండగంబుల నడంచి

రాజ్యంబు వెడలఁ గొట్టినఁ గాని మనపూన్కి నెఱ వేఱదు. (లీలావతితో మెల్లన) ఈ దుష్టుని మంచి మాటలచే నిఱీకింపవలయు. నీవాచాలత నొక్కింత చాటింపుము.

లీలా—అయ్యో! మనుష్యనైజగుణంబు లింత నికృష్టం బులే? (రాజుం జూచి) నృపమణీ! లోకమునం దొక వింత గలదు. మానవుండు నైజగుణంబును దూఱ లేక మనుజజన్మంబును దూఱుచు, దానికిలేని దుర్గుణం బుల నంటఁబెట్టి "అక్కటా! ఈమానవజన్మం బెంత నీచ" మని పలుమఱు వాపోవుచుఁ గన్నీరు విడిచి పల వించును. ఇట్లు కుంఠితమనస్సంచారుం డగువానికి నుర్విలో నెట్టిదియు సకారణంబు కానొప్పు.

తే-గీ. కన్నులకు ముందుఁ బచ్చనౌ గాజుచిప్పఁ
బట్టుకొని చూడ భువి యెల్లఁ బచ్చనైన
చందమున మూర్ఖు మెదఁ బూని సంతతంబు
మెలఁగువానికి నొకచాయఁ బొలుచు ధరణి.

(విజయుఁడు బయలు చూచి చిఱునవ్వు నవ్వును.)

దుష్ట—(మెల్లన లీలావతితో) విజయుఁడు పట్టువడెను.

మద—భళీ! లీలావతి! నీవు విదుషి వైతివి.

లీలా—(విజయునిఁ జూచి) అయ్యా! రాజేంద్రుండు నామా టల కానందించెను. తమరు మహీధవునకు నెయ్యురగుట మీయభిప్రాయ మీయంశంబున నాకు వాంఛితంబు. ఇటు తిరుగుఁడు.

తే-గీ. కల్లు ద్రాగినవానికిఁ గాళ్లు తడఁబ
డంగఁ జిత్తంబు స్థైర్యం బడంగఁ దూలఁ
జూపు లతిమాంద్యమున సోల సొరిదిఁ బుడమి
తల్లక్రిందుగఁ బొల్పుఁగా తఱుచు మాడ.

మద—లీలావతీ! నీ మాటలకు మెచ్చితిని. నీవన్నది నిక్కంబు. కాని మనవిజయునియెడ గుఱి తప్పెను. ఇతఁడు నాకుఁ గూర్చునెచ్చెలి. ఈతని బుద్ధి విశేషము నే నెఱుంగుదు. అది యొక్కొక్కతఱి మాంద్యంబున మెలంగుంగాని యజ్ఞానంబున నెన్నఁడును మెలంగనేరదు. జనులు సదసద్వర్తనల నెఱింగి వివేకంబున్నై నసత్కార్యంబులఁ ద్యజించి సత్కార్యంబులకుఁ బాలుపడమికిఁ జింతించు విజయుని మనోగతులు నింద్యంబులు కానేరవు. మఱియు......

విజ— రాజేంద్రా! నావిషయమై నీవన్నమాటలకుఁ గృతజ్ఞుండనైతి. నన్ను వీడ్కొల్పుము. కాననంబున

విచ్చలవిడిఁ దిరిగినఁ గాని ననుఁ గ్రమ్మిన మౌర్ఖ్యం
బు నను వీడదు.

మద—(తనలో) లీలావతి యితని గుణంబు దెలియక యిట్లు
పలికె. దీనిచే నితనిమనం బొక్కింత నొచ్చెను. కా
వున నితని నిలుపక తనయిచ్చకు వచ్చినట్లు చరింప
విడిచెదను. (ప్రకాశముగ) విజయా! నీయిచ్చచొప్పున
నడవింద్రిన్నురుము. ఆయుధపాణులగు భటుల నంగరక్ష
ణంబునకుఁ గూడఁ గొనిపొమ్ము.

విజ—నృపవర్యా! నాతోడ నెవ్వరు రావలదు. వాలు
మేకంబు లింకున్నవని భయ మందె దేమొ.

తే-గీ. ఒడలు నేఁ డిటు నడచును, బడలి రేపు
పుడమి నొఱగును, మఱునాఁడు పొలుపువీడి
కూలు నసువులు వెడలంగ, నోలిఁ బ్రాణ
భీతి నడలనేల జనులు జేల లగుచు?

నాకై దిగులొందఁ బనిలేదు. ఈశ్వరుని రక్షణంబు
నమ్మినవారికిఁ బెఱలప్రాపు నిరర్థకంబు. రాజేంద్రా!
ఇఁక నాకు సెల వొసంగుము.

దుర్బు—(మదనుం గాంచి నవ్వుచు) భూపకులమండనా!
మనవిజయుని కీశ్వరభక్తియు నయవిచారంబును నెరసి
బెరసియుంట—

మద—(విజయునితో) నీ దైవభక్తికి మెచ్చితి—

విజ—

సీ. భవసాగరంబునఁ బరిఢవిల్లెడు దుఃఖ
  మెఱుఁగక శైశవం బెడలి పెరిఁగి
సమవయస్కులఁ గూడి జాలిఁ గాంచక కేళి
  బాల్యంబుఁ గడఁపుచుఁ బరువ మెసఁగ
జవ్వనంబును బొంది మవ్వంపు వైహిక
  సుఖముల నెంతయు సోలి బడలి
ముదుసలి యగుచును మూల్గి తొల్తటిచర్య
  ల కెడంద రోయుచు లావు దొఱఁగి
జముఁడు నిజభటులను బంప సడలి యింది
  శేషఁ గొల్వమి యాతన నెడలి ప్రాణ
మక్కుట వసుండు తనజన్మ మవనిఁ బాడు
  సేయు, .. .... .......

దుర్బు— ఎల్లరు నీగతిఁ జేయువారె?

విజ—(బదులిడక) రాజచంద్రమా! ఇఁక నాకు సెల వొసంగుము.

మద—విజయా! నీ యిచ్చకు వచ్చినట్లు చరింపుము. వైళంబ నీ వనవిహార కుతూహలంబు చాలించుకొని తిరిగి వచ్చి మమ్ముం గలసికొనుము.

[విజయుఁడు వందన మాచరించి వెడలును.]

లీలా—ఉర్వీతలేంద్రా! ఈ విజయునినడతలు చోద్యం బులు.

[మదనుఁడు యోచించుచు నూరక యుండును.]

దుర్బు—లీలావతీ! సుధీబలంబునను, నీతిశాస్త్రప్రావీణ్యం బునను దమ్ముఁబోలు వారొరులు లేరని తలఁచు దురభి మానుల కిట్టి నడతలు సహజంబులు.

మద—దుష్బుద్ధీ! విజయుఁ డాడిన మాటలు నా మనం బుఁ గలంచుచున్నవి. వైళంబ యొక్క భటు నతని వెన్నాడఁ బనుపుము.

దుర్బు—మదనావనీధవా! భటుఁడు వలదని వారించి యేక తమ కానఁ దిరుగాడ నేగు నతనివెంట నేల యింకొక్క నిఁ బంపవలయు? ఎట్టి ధైర్యవచనంబుల నాడినను నతఁ డీ దుష్టమృగవహనం బగు గహనంబున నాయుధంబుల నంగ రక్షణంబునకై తాల్పక నడయాడ నోపఁడు. మఱియు మనపటకుటీరంబులడాఁపుననే చరించుచుం డుం గాని యరణ్యానిం జొర సాహసింపఁడు....... రాజేంద్రా! అతనిమాటలు మిమ్ముఁ గలంపనేల?

మద—ఆ నుడులు నిక్కంబు లగుట నిస్సంశయంబు. శైశవంబున నెఱుకలేమి నుదరపోషణంబె ముఖ్యకృత్యంబుగఁ దలపోసి కాలంబుఁ గడపి, బాల్యంబునఁ గేళీలోల్యంబున భావికాలంబుఁ బరిగణింపక నానాఁటి వేడ్కలకె పట్టువడి, జవ్వనం బంకురింపఁ దద్బలంబున నిక్కి మదవతీకటాక్షవీక్షణనిశితవిశిఖౌఘంబుల మార్కొని బలిమి దొఱంగి జితులై యువతీపరిరంభణంబులకుం బట్టువడి విడివడుతెరు వెఱుంగక తమ యారోగ్యంబు లాకొమ్మలకు దారపోసి తమస్వచ్ఛందవృత్తి విలిచి, వార్ధకంబునం బడలి కడు నడలి తమ లోతుటికార్యంబులకుఁ బరితపించి యించుకయేని నిశ్చలవృత్తిఁ బొరసి రమామనోహరుఁ దమ హృదయపీఠిఁ దాల్ప నోపక భవదుఃఖంబుల సత్తమిల్లి నరు లసువు లెడలుట మనము చూచుచున్నారము.

దుర్బ—(తనలో) ఔరా! విజయునిపిచ్చి యితనికిం దగిలెను.

లీలా—రాజేంద్రా! వనంబునకేగిన విజయు నరసి వెంటఁ బెట్టుకొని మనరాజధాని కేగుదము. వనకేళీలోల్యం

బు నీకిప్పుడు తలుఁగుట తెల్లమయ్యె. ఇంక నిం దేల తడయవలయు? లెమ్ము.

మద—ఔను. దుర్బుద్ధీ లెమ్ము. ప్రయాణసన్నాహంబుఁ జాటింపుము. (అందఱును వెడలెదరు.)

---

# క న కాం గి.

---

## తృతీయరంగము.

అడవి.

[ ప్రవేశము—ధనుష్పాణి యగు దుర్బుద్ధి. ]

---

దుర్బు—ఔను. అట్లే చేయవలయు. నా పట్టు సాధింతును. లీలావతిచేఁ గనకాంగిం బొలియించెద. వీని నేన...... నేనా? — ఈపనిని నేను జేయుట తగునా? వాఁడు మదనునకుఁ గూర్చు నెయ్యుఁడే! అతనికిఁ గీడొనరించి రాజేంద్రునిమో మెట్లు కాంతును?......విజయుని కెగ్గొనరించుట మదనున కొనరించుటయె కాదె?......ఇది యేల నామనం బిట్లు కలఁగుచు

న్నది?......దుర్బుద్ధీ! కఠినశిలానిభంబగు నీ హృదయంబు నీరయ్యెనా? సాహసింపవేని నీ చిరకాలాపేక్షితార్థం బ్బెట్లు లొడఁగూడును? ఒడఁగూడదుపో... ఒడఁగూడకున్న నేమి యగును?......ఏమి యగునా? నేఁటివఱకు నే నొనరించిన కార్యములన్నియు వ్యర్థములగును. నా హృదయస్థలి నాటిన యపేక్ష......అది యటుండనిమ్ము. విజయుని వధించుటవలని ప్రయోజనం బేదియో విచారింతము.......విజయుఁడు మదనుని శ్రేయోభివృద్ధిని వాంఛించువాఁడు. నా తలపోఁతల గుట్టెఱింగి నా కార్యములకు విఘ్నంబులు సేయువాఁడు. (కన్నుల నెత్తురదనంబు గదుర మెల్లనఁ బలుకును) అతినీచునిఁ జూచినట్లు నన్నెన్నఁడుఁ జూచువాఁడు. తన త్రోవకు నృపు నెలయింపఁదగిన మాటల నాడువాఁడు. ఇతఁడు బ్రతికియున్న నా తలపెట్టిన కార్యంబు నెఱవేఱదు... నెఱవేఱకున్న నేమి? ....నాకు నెగ్గొనరింపని వాఁడగు నతని కేల ... ఇదివఱకు నెగ్గొనరింపఁడు. ఇఁక నొనరింపఁగలఁడు. నేనో యిప్పుడు వెనుదీయలేను. కోదండంబున మౌర్వి నెక్కిడితిని. బాణంబును గీలింపఁబడియె. నారి యాకర్ణాంతాకృష్టంబగుటం ధను

వు వలయాకారంబు...అదెవరు?...నాతలపోఁతలకుఁ జిక్కి నలుప్రక్కలఁ జూడనైతి. ఇది వివిక్తప్రదేశంబని తలంచి నా హృదయపేటిక నతి గుప్తంబులగు తలంపుల వెలిఁబుచ్చితి. ఇతఁడు విని యుండునో?..... అతఁ డెవఁడై యుండును?...పుడమిం బరికించుచు మెల్లన నడచుచున్నవాఁడు. చూడం జూడ నితఁడిం దెందో దాఁపుననె పొంచి, బేలనై నేను బలికిన మాటలను విని కలంగి మెల్లన జాఱుచున్నట్లున్నది. అతఁడు విజయుఁడైయున్న.......విజయుఁడా?.... అదె యతఁడు తిరుగుచున్నాఁడు......(ఉలికి) ఔ నతఁడు విజయుఁడే.ఇప్పుడు విడువఁదగదు...(విల్లెత్తి యమ్ము సంధించి వేయును. విజయుఁడు భూమి నొఱఁగును) ఔర గుఱి తగిలెను... (అని పాఱును.)

విజ—(పాఱు నతనిఁ గాంచి మెల్లన) దుర్బుద్ధీ! మంచిపని యొనరించితివి. ఇఁక నీ యుద్యమంబులు నెఱవేఱఁ గలవు. నేను బ్రతికియున్న నీ దౌష్ట్యంబున కెడవీయను. అది యెఱిఁగి నీవు నన్ను మున్న చంపితివి. ఇఁకఁ గనకాంగీ మదనుల నా రామచంద్రుండె ప్రోవవలయు. మనుష్యబలంబు........(మూర్ఛిల్లును.)

[ప్రవేశము—సశిష్యుఁడగు కరుణాసింధువనుముని.]

ఒకశిష్యుఁడు—గురువర్యా! అతఁడేల యట్లు పాఱుచు న్నాఁడు?

మఱియొకఁడు—ధనుర్ధరుఁడై కాళ్లు తడఁబడ నోడలు వడఁకఁ బెనుభూతమును జూచినట్లు దిగులున.....

ముని—బాలకులారా! జింకల వేఁటాడువారికి సింగంబు పొడకట్టిన నిట్లె భయమంది పాఱుదురు.

మొదటి శిష్యుఁడు—ఆహా ధైర్యసామగ్రి!

మఱియొకఁడు—ఇట్టివాఁ డేల వేఁటకు రావలయు?

మొదటి శిష్యుఁడు— (విజయుంగాంచి) ఇది యేమి యె వఁడో వెఱ్ఱివానివలె నీముండ్లపైఁ బడి నిదురించు చున్నాఁడు?

మఱియొకఁడు—మునివరా! ఇతఁడు నిదురించువాఁడు కాఁడు. ఇదె యితని భుజముఁ జూడుము.

ముని—(చూచి)అయ్యో పాపము. ఏమో తగిలెను. నెత్తురు కాఱుచున్నది.

మొదటి శిష్యుఁడు—(పరికించి) అదె యీ గాయమున నొక ముల్లు కనఁబడుచున్నది.

ముని—(దాని నూడఁ బెఱికి) బాలకులారా! ఇది ముల్లు కాదు. ఇది యమ్ము. ఇప్పు డట్లు పరుగెత్తినవాని పని యిది. (అని నిజ కమండలూదకంబున నెత్తురు గడిగి సమీపమున నున్న యొక కొన్ని మూలికలఁ జేత నలిపి యా పసరు గాయమునకు రాచును.)

మొదటి శిష్యుఁడు—ఇట్టిపని చేసినందుననే యతఁ డట్లు దిగులనఁ బాఱెను.

ముని—పలుకక యూరకుండుఁడు. ఇపు డితఁడు కన్నులు దెఱచును. నిశ్శబ్దముగ నిలువుఁడు (అని పసరు మెల్లన రాచును.)

విజ—(మెల్లనఁ గన్నులు విచ్చి మునిం గాంచి కన్నీరు గార్చును.)

ముని—ఇఁక భయ మందకుము. నీవు బ్రతికినవాఁడ వను కొమ్ము.

విజ—(మెల్లన లేచి) బ్రతికినదియె చింత.

ముని—ఏల యట్లాడెదవు?

విజ—

స. పుడమి సుఖంబు గల్గునెకొ? భూరివివేకముఁ గల్గువార లే
యెడ నిలఁ జింతలే పొసలు నేడ్తెఱ నంచును బల్కి_ ధారుణిక్

బడలఁగలేక ముక్తిఁగన బల్విడిఁ గానలఁ జేరి మాధవుక్
గడుకొని కొల్చి నాకమును గాంచి సుఖింపరె యోగిసత్తమా!

ఆ-వె. భువిని మానవజన్మంబుఁ బొందినట్టి
ప్రాణి సుఖియంచు నాడంగరాదు; నాకుఁ
జూడఁ బశుకీటకాదులె సుఖముఁ గాంచఁ
గడు వివేకంబు లేమిచే నడలులేమి.

అరివర్గంబులచే నిర్జితులై బలం బుడిగి, ఆశాపాశం బులఁ గట్టువడి విడిపించుకొను వెరవెఱుంగక, దుష్టై హికవిచారోగ్రగ్రాహవితతికిఁ జిక్కి యుక్కడి, భయద భంగసంకలితభవపాథోధిని మునింగి తేలుచు, నావలి గట్టుఁ జేరునుపాయంబుఁ గానక బిట్టడలి, పురాకృత దుష్కృతఝంఝామారుతపాతంబునఁ గొట్టువడి పరి తపించు మానవజన్ములకు మరణంబు చింతాంబుధిం దరింప నను వైన తరణి కరణి శరణంబు కాదే.

ముని—నీవన్నది నిక్కంబె యగును. ఈశ్వరునాజ్ఞలేక యెద్దియు సమకూరదు. ఈ దుష్టునికోల నినుఁ దాఁకు టయు నీవు దానం బొలియకుంటయు నేనియ్యెడ నిత్తఱి వచ్చి నిన్నుం గావఁగల్గుటయు దైవసంకల్పితంబులు గావే!...ఇట్లీతఁడదయత నిన్నేయనేల? ఇతఁడెవఁడు?

విజ—మునీంద్రా! చిఱుచేఁపలఁ బెనుజేఁపలు మెసవిపోదలు నట్లు మనుజులు....యోగీశ్వరా! మనుజగుణంబుల నిరూపింప నగునే? మానవుఁ డెన్నఁడు నొకరూపున నుండునే?

శా. ఉర్వి న్మర్త్యుఁడు చంచలుం డగుచుఁ దా నున్మాదచేతస్కుఁడై
గర్వాంధ్యంబున మత్తుఁడై యితరులన్ గారించుఁ దానొక్కటన్;
ఖర్వుండై నతుఁ డౌచుఁ గొల్చుఁ బెఱల న్గార్యార్థియై యొక్కటన్;
సర్వేశుండను నేన యంచు మదిలో సంతోషి యౌ నొక్కటన్.

ముని—ఇది నిక్కము......నాపర్ణశాలకుం బోవుదము రమ్ము. అందొక్కింత విశ్రమించి సేదదేఱి నీవృత్తాంతంబంతయుఁ దెలుపుదువు గాక. నినుం జూచిన నా హృదయంబు కరుణార్ద్రం బగుచున్నది. పోవుదము. లెమ్ము. బాలకులారా! ఇతని హస్తములఁ బట్టి మెల్లన లేపుఁడు.....అల్లే యల్లే.....జాగ్రత్తజాగ్రత్త... ఇదె నన్నుఁ బట్టుకొనుము.....ఇదె యీ యోగదండము నూఁతగఁ బట్టుకొనుము.....ఆతురత వలదు.

(నిష్క్రమణము.)

---

# కనకాంగి.

## తృతీయాంకము.

### ప్రథమరంగము—మణిపురరాజవీధి.

[శిష్యవేషధారియగు విజయునితో మునిప్రవేశము.]

ముని—బాలకా! చూచితివా యీ పట్టణమునందలి సమ్మర్దము.

చ. భువనము దుఃఖపంకిలము భూరిసుఖాస్పదమే యటంచు మా
ధవుపదకంజముల్ హృదయధామమునం గదియించి కాన నీ
భవమును వీడఁగా నిలిచి భవ్యతపంబులఁ బొల్చు మాకు నేఁ
డవుర పురీపరంబిది మహాద్భుతమైనను మోద మిచ్చునే!

సీ. ఘణఘణంఘణనాద కలితంబులైవచ్చు
శకటాళిచే నెద సడలుచుండ
గురుకరచలనంబు నురుబృంహితోత్కర
మొలయించుద్విరదాళి కుల్ల మదల
నతివేగధావన మతుల హేషితములు
నించుహయాళికి నెమ్మి గలఁగ
సింహనాదార్భటి చెలఁగంగ నడయాడు
భటులఁ గన్గొన భీతి ప్రబ్బుచుండ

జనులసమ్మర్దమునఁ దాల్మి బొనుగుపడఁగఁ
గలఁగి యిందిరేశుని పదకమలములను
నిరతమును గొల్చు పుణ్యుని బెరయ కిట్లు
మెలఁగ మాబోంట్ల కొప్పునె!

విజ— లలిత చరిత!

తే. రాజకార్యంబు నెఱవేర్ప నోజనెట్టి
కార్యములనైన నోరిచి కాదె బుధులు
చెలఁగు వారలు! నృపునికిఁ జెట్టఁ దలఁచు
వారిమంతనంబు లణంప వలదె మనకు.

చ. మునివర! భూధవేంద్రు పగ ముంపఁగ నెన్నెడు దుష్టబుద్ధులన్
బనుపడి యూరకే విడువఁ బాడియొకో! మదనావనీధవున్
వనటను గూల్ప నీఖలులు వారక యాకనకాంగిఁ జంప నె
మ్మనమున నెన్నినా రకట! క్ష్మాధవుఁ డూరక వీరి నమ్మెడున్.

తనయాచారం బెంత నింద్యమై పొనుగువడియున్నను మదనావనీపాలుండు కరుణార్ద్రహృదయుండును నిష్కల్మషస్వాంతుండు నగుటఁ బెఱలదౌష్ట్యం బెఱుంగఁడు. దొంగనెయ్యంబు వాటించు కితవుల నికృష్టంపు టుక్కివం బెఱుంగమి నమ్మాయావులఁ దనవారిఁగఁ దలంచి మెలంగును. నేఁడిట్లు నివురుగప్పిన నిప్పుపోల్కిఁ దెలివిఁదాల్పక చరించినను రాజేంద్రుండు వైళంబ యీ మరుద్యముల చెడుతలపోఁతల నెఱింగి ప్రజ్ఞామహి

తుండయి మన కెల్లరకు ముదంబు సమకూర్చు. ఇంత లోననె యీ దుష్టులపూన్కి నెఱవేఱెనేని నవనీ శుండు తలయెత్తనేరఁడు. ప్రజ్ఞాధిరూఢుండై నిజ భార్యావియోగంబు సహింపనేరక యుత్తలంబునఁ గలంగి తపసియై కానలఁ జేరునో, యుడుగని దుం దుడుకు నెడఁబాయలేక యసువుల వీడునో, శోకా గ్నిచ్ఛటల దహింపఁబడిన మనంబుఁ జిక్కఁబట్టనేరక యెఱుక వీడి వెఱ్ఱియగునో............మునీంద్రా! తలంపఁ దలంప నీ కట్టిఁడుల తలపోఁతల రాజున కెట్టి కీడు మూడునో! దాన న్మన కెట్టి దుఃఖంబు సంభవిం చునో? ఇది విచారింపుమా.......కనకాంగీదేవి సాధ్వీమతల్లి గాదే? ఆమెకుఁ జెట్టయొనరింపఁ దలపోయు దుష్టులు వర్ధిల్లుదురే? ఈశ్వరుండు వారి చేఁతలకు సైఁచునే?..............................

ముని—బాలకా! ఈశ్వరుఁడు కనకాంగిం బ్రోచువాఁడు— మఱియు మదను నీ దుష్టులవలనం గాచువాఁడు.....

విజ—మునివరా! వారల నీశ్వరుఁడు బ్రోచుట నిక్కంబె యైన మనశక్తికొలంది మనమును బాటుపడవలయు.... ఇట్టి వారిమంతనంబులు నా వీనుల సోఁకినవెనుక నే

నూరక యుండఁ బోలునే? "నావిష్ణుః పృథివీపతి" య నెడు నభియుక్తిచొప్పున దేవతాంశసంభూతుఁడై ధర్మా ధర్మంబులఁ బరికించి శిష్టుల రక్షించుచు దుష్టుల శిక్షించుచు వఱలు నృపేద్యునకుఁ జింతలు దనుక నగునే..

ఉ. వీరల దౌష్ట్యము ల్దెలిసి వెఱ్ఱినె యూరకయుండ! నింక నా
భారము రాణిఁ బ్రోచుచును బార్థివసింహుఁ బ్రబుద్ధుఁ జేయుటల్;
క్రూరుల దుర్మదాంధ్యపరిఘూర్ణితకిల్బిషచిత్తులన్ దయో
దారులునైనఁ బ్రోచెదరె ధారుణి దాల్చునె వారలన్ మునీ!

ముని—నిక్కంబు పలికితివి.

విజ—మునికులతిలకా! సత్కార్యాచరణంబున నేయి క్కట్టుదొట్టిన వెనుదీయఁదగదు. మిముఁబోలు మహా నీయుల కే నా యుపదేశం బొనరించువాఁడ? మద నుఁడు సత్కులప్రసూతుఁడే, అనింద్యధర్మప్రవర్తనల ననిశంబు నడచిన పుడమిఱేనికిఁ బుత్రుఁడే, సద్యశో పేతయగు మానినీమణికి ధవుఁడే, అని యిట్లు కొందలం బునఁ గుందు నాకాలీలావతీ దుర్బుద్ధుల దురుద్యమంబు వినవచ్చె. కట్టా వీరి చెడుచేఁతల నాసాధ్వి పాలియ నౌనే, మనలఁ బరిపాలించు నేలికకుఁ గీడువాటిల్లఁ దగునేయని పరితపించి యట్లు మీ సాయంబు వేఁడి

మిమ్మిప్పురంబునకుఁ దోడ్తెచ్చితి. మీశక్తికొలఁది నికా ర్యంబు సాధింపఁ జేదోయి మొగిచి వేఁడువాఁడ......

మునిచంద్రమా!

చ. అతులిత సద్యశం బెడలి యార్యవిభూషితసత్పథంబు నీ
గతి నెడఁబాసి దుష్టజనకాండముఁ గూడి విభుండు ముగ్ధతన్
గితవుల మాయలన్ దవిలి క్లేశముఁ గూర్చి సతిం గలంప నం
చితమతి నెప్పుఁడోప్పు నెదఁ జింతిల కూరకయుండఁ దాపసా!

క. ఎన్నఁడు నృపుఁ డీదుష్టుల
మన్నించుట వీడునో బుధమానితమార్గం
బెన్నఁడు పొడగాంచునో సతి
నెన్నఁడు ముదమునను దేల్ప నెఱుఁగునో మౌనీ!

ముని——విజయా! నీ మాటలకు మెచ్చితి. ఇందిరారమ ణుని కరుణ గలుగ నికార్యంబు మనము తలపోసి నట్ల నెఱవేఱనోపు. ఆదుష్టవారాంగన మందిరం బిం కెంతదూరమునన్నది? నిన్ను నీవు దెలుపుకొనకుము.

విజ——

చ. మునివర! నన్నుఁ దెల్పుకొని మూఢుఁడనై పనిఁ బాడొనర్తు నే!
గొనకొని వండి యన్నమును గొబ్బున నూతను వేయువాఁడ నే!
జనపతిఁ బ్రోవఁగాఁ బురికిఁ జయ్యన వచ్చినమీకు నెప్పుడే
యనువున నెట్టిసాయములనైనను సేయఁగ నిల్తు నర్థిలిన్.

ముని—కోపమువలదు. ఆదుష్టవారాంగన చెయ్దములకుఁ గినిసి మేను మఱచి........................

విజ—మునీంద్రా! అదె చూచితివా? లీలావతి హర్మ్యతలం బున నిల్చి యాకిటికిఁ దెఱచి మనవైపుఁ జూచుచున్నది. దీనికి సాధువులయెడ నెంతయు గౌరవము. కావున మనలఁ దనయింటికిఁ బిలువనోపు.

ముని—పిలిచెనేని మనకార్యము సఫలమైనట్లే.

విజ—మౌనికులమండనా! ఈశ్వరభక్తియుఁ బత్యనురక్తి యుఁ గలిగి యలరారు సాధ్వీమణి నంబుజాక్షుండక్షీణ కృప రక్షించునని మున్నంటివి. కనకాంగి లోకైక వినుతచర్యగాదే..........................

ముని—బాలకా! ద్రౌపదీమానరక్షకుండగు పక్షివాహ నుండు వైళంబ కనకాంగింబ్రోచు నిది నిక్కంబు....

విజ—మునికులమణీ! తనపతులకు మాఱాడక, నంద నందను చరణారవిందంబుల నెడతెగక హృదయ పేటికం బదిలపఱిచి మునిబృందంబులచేఁ దోష్టూ యమానంబులగు సుగుణంబులకు గనియై, దీనావనం బునం బేరెన్నికఁగన్న పాంచాలిని గంసారి మనిచి

నది నిక్కంబ. ఐన, గురువర్యా! అమ్మానినీమణికిఁ గీడొనర్పఁ దలపోసినంతనె యా ధార్తరాష్ట్రులఁ జేసేత నివారించి యా దుస్ససేను కరస్పర్శనంబున నేని వంతంబొరయకుండ నద్దేవినిఁగావ నెన్నక, సుయోధనుండు కట్టిఁడియై నీచోక్తు లనేకంబులాడఁ దదనుజుండు దుర్వారగర్వపర్వతాధిరూఢుండయి వాత సంచాలితలవలీలతామతల్లిఁబోలె నంగదం గంపించు నమ్మించుబోణివలున లొలువఁ, బంచాస్యయూథంబు నడుమఁ దగులువడి దిగులున నలువైపుల దైన్యంబునఁ జూచు హరిణికరణిఁ జూపట్టు నవ్వానినీతిలకంబుఁగాంచి శోకించి సభ్యులు గుసగుసలంబోవఁ దామిన్నకుండి...

ముని—భళి! బాలకా! వెనుక వెనుక.

విజ—గురువర్యా! హేళనము సలుపఁ దగదు. నాహృదయ స్థలిఁ జిరకాలంబుగ నీశంకయంకురించి పెఱుఁగఁజొచ్చె. సమయమునఁ బ్రోవక తటితప్పి యా దుష్టులదుండగంబులు హెచ్చిన యప్పుడుగదా కృష్ణఁ గావ నమ్మురారి దలపోసె. అమ్మానవతికి మానరక్షణంబునకు మున్ను పాటిలిన పాటులేనిం బొరయఁ దగదు. అప్పులువల దుండగంబులు ముదురుటకు మున్నె య

య్యన్నులమిన్న నవ్వెన్నుండు మన్నించినం జెన్ను
సఁగియుండు. ఇట్లయ్యాశరణశరణ్యుండగు గోపాలవరే
ణ్యుండు..........................

[రదనికప్రవేశము.]

రద—సంయమిమండనా! అదె చూపట్టు మందిరంబు
నకుఁ బ్రభ్వియగు లీలావతీదేవి తమదర్శనార్థంబు వేచి
యున్నది..........................

ముని—ఆమె యెవతె?

రద—మదనమహీతలేంద్రునకుఁ బ్రాణేశ్వరి.........

ముని—అతనిభార్య కనకాంగీదేవి యని వింటి.

రద—మా రాజేంద్రుఁడు కనకాంగికి బొట్టుఁగట్టెఁగాని
యీ లీలావతికి మనసిచ్చె.

ముని—ఓ—నృపవర్యుని మన్ననవడసిన లీలావతికి నా
దర్శనంబువలనిఫలం బెయ్యది?

రద—నిరాహారులసందర్శనం బెరికి ముదం బియ్యదు?

ముని—శిష్యా! ఏమందువు? లీలావతి గృహంబున నొక్కింత
తడసి గంగాతీరంబున కేగుదమా?

విజ—తమయిచ్ఛయె నాకు నాజ్ఞ.

ముని—అట్లే చేయుదము. ఈ లీలావతి యెట్టిదియో కనుంగొందము. నారాయణధ్యానానందరసమత్తమనస్కులగు యోగులయెడ విశ్వాసంబువాటించు నీతన్వి సుగుణ ఖనియై యుండనోపు. దానిచే సత్కృతులమై జాహ్నవీతీరంబున కేగి కృతస్నాతులమై జపంబునకుం దొడంగుదము. (రదనికతో) త్రోవం జూపుము. నిన్ననుసరించెదము. (నిష్క్రమణము.)

---

# కనకాంగి.

---

తృతీయాంకము.

---

ద్వితీయరంగము—లీలావతిమందిరము.

[లీలావతియు, దుర్బుద్ధియుఁ బ్రవేశించెదరు.]

---

దుర్బు—అట్లు సేయక పోయిన వేఱుగతి లేదు. ఏల యోచించెదవు? వేఱుత్రోవ యున్న నిది మానవచ్చును. ఏల బదులాడవు?

లీలా—దుర్బుద్ధీ! ఇది క్రూరకృత్యముగదా?

దుర్బు—మఱి వేఱే త్రోవ యున్నది?

లీలా—లేకున్న నూరక యుందము.

దుర్బు—అట్లయిన నేఁడు మొదలుకొని నా సాహాయ్యం బబి లషింపకుము. ఇంతియ కాదు. నీకుఁ బ్రత్యర్థినై పాటు వడి నిన్నీపట్టణంబునుండి వెడలఁ గొట్టు నుపాయంబు చేసెదను.

లీలా—దుర్బుద్ధీ! నాపైఁ గినియవలదు. క్రూర......

దుర్బు—నీ బుద్ధి తెలిసె నిఁకఁ జాలును. ఈ రాజ్యం గూడు టకు నీవు నన్నెంతయో వేఁడితివి. కన్నుల నీరుగార్చి తివి. "నీకు నేను సేవకురాల" నంటివి. నామాట జవ దాఁట నంటివి. నీ మాటలను నమ్మి, నీ చర్యలను నచ్చి, నమ్మినదానిని విడువఁ దగదని యెంచి, దంపతుల నల్లెడఁ బాపి, మదనుని తండ్రికిఁ గానివాఁడనై తలదాఁచుకొని యుండి, యమ్ముసలి స్వర్గస్థుఁడైన వెనుక మదనున కమాత్యుఁడనై నిలిచి నీ యుద్యమంబులకు సహా యుఁడనై నీయం దతనికి మనంబు లీనమగునట్లు ప్రల్ల దంబులాడి నీకై తగని పనులుచేసి ప్రజలచే దూషి తుఁడనైన........

లీలా—(నవ్వి) దుర్బుద్ధీ! నాకై యింత పాటుపడితివొటు! నేను మదనునకు హృదయేశ్వరినైనందున నీకుఁ గలిగిన లాభమును మఱచితివి. నీ ప్రకృతస్థితి కెవ్వరు కారణము? నీకును లాభము గలుగదేని నాకై యింత పాటుపడి యుందువా?

తే. తాము చేసినపనులనె తలఁచుదుండ్రు
గాని తా మొరులవలనఁ గాంచినట్టి
మేలుఁ దలఁప రకృతమతుల్; చాలుఁ జాలు
నేల యీరీతిఁ బలుకంగ నెఱుకవీడి.

దుర్బు—చాలును నీప్రల్లదములు. అదె రదనిక వచ్చుచున్నది. ధైర్యముఁ దాల్చి సన్యాసితోఁ బలుకుము (అని వెడలును.)

[రదనిక మునిశిష్యసమేతయై ప్రవేశించుచున్నది.]

లీలా—మునిసార్వభౌమా! దండములు.

ముని—నారాయణ!

లీలా—

చ. వనరమఁ జేర మాధవుఁడు వచ్చినఁ గానన మంతయుఁ గడుఁ
గొనబగులీల నాగృహము కూరిమి మీ రిటు వచ్చుటఁ సిరిఁ
బొనరుచు నొప్పె నామదియు భూరిసుఖస్థితి మోద మందె నీ
వనధిపరీతభూస్థలిని భామలు నన్బొగడింప నేర్తురే.

విజ—(తనలో) నిక్క—మీగృహంబు క్రూరజంతు నివహ వహనంబగు గహనంబ.

ముని—

క. నిరతము సుఖములఁ బరఁగెడు
తరుణులు యోగుల కెరఁగుట ధరలోఁ జూడన్
గర మరుదగు; నీ భక్తికి
మరియుఁ దొడఁగె సాధనంబు ముకురకపోలా.

లీలా—సంయమిమండనా! ఈ పదునాలుగు లోకముల సృష్టిస్థితిలయంబులకుఁ గారణభూతుండగు నిరనుమితమహత్త్వుండు శ్రీమన్నారాయణుండు మిముఁ బోలు సాధువులహృదయారవిందంబులయందు నెడ తెగక వసించునని యెఱింగిన మాబోంట్లు మిమ్ముఁ గొలుచుట చోద్యంబె?

తే. నిజపదాంబుజసేవచే నెగడు భక్త
వితతిఁ గొలువక జడుఁడైన వేడఁగు నెపుడుఁ
బ్రోవఁ దలఁపఁడు హరియంచు బుద్ధి నెఱిఁగి
నట్టివారు మానులఁ గొల్చి యలరువారు.

ఇంతియకాక.

సీ. నిశ్చలానందంబు నెఱయించునే భువి
యందుఁ గానల నిల్వ నలసువారి
దామోదరునిఁ గొల్వ కేమెయి భవవార్ధి
దాఁటనౌనని యిలఁ దలఁగువారి
హరిపదాంబుజసేవ నబ్బు ముక్తి యటంచు
సంసారబంధంబు జార్చువారి
విషయసుఖంబులు వెగటుగాఁ దలపోసి
యాముష్మికంబుల నరయువారి
భక్తి దైవారఁ గొలువంగఁ బాతకంబు
లెల్లఁ బొలియును, హృదయంబుఁ బల్లవించు,
నీకు కారుణ్య మొలయు, నా నెఱిఁగినట్టి
నాకు మీరాక యానంద మీక చనునె!

విజ—(తనలో) ఆహా! కైతవభక్తి! కారణము లేక యిమ్ముని నిందు రప్పించి యుండునా? ఈ భక్తి నిక్కమగునా?

ముని—చెలియా! నీమాటలు నిక్కంబులు. చెలువలకు సాధువుల మన్నించుట కర్తవ్యము.

లీలా—జటికులమండనా!

తే. కుంతి దూర్వాసు భక్తిమైఁ గొలిచి వరము
లందె నాశకుంతల బేల యగుచుఁ గొలువ
కెంతయును బాటులను గుందె వంత లణఁపఁ
జింతలూడఁగూర్చ వలఁతులు సిద్ధవరులు.

ముని—అతివా! నీబుద్ధికి మెచ్చితిని. నీవన్నది నిక్కము. న్యాయ మార్గానురక్తియు, సాధుజనభక్తియుఁ, బతి శుశ్రూషానక్తియుఁ గల్గు నింతికి నీశ్వరుం డెల్లెడలఁ దోడ్పడువాఁడు.

లీలా—మునివరా! ఈయంశంబు తేఁటపడ నొక్క యితి హాసం బుపన్యసింపుము.

ముని—పడఁతీ! ఇప్పు డీమందిరంబునకు వచ్చుట కొక్కింత మున్న యిబ్బాలనుండు నన్నొక్క ప్రశ్నయడిగె....

లీలా—జటికుల శేఖరా! దాని నానతిమ్ము.

ముని—దీనావనంబునకు దీక్షవహించిన యయ్యశోదా నందనుండు కౌరవకృతపరిభవాంబురాశి మునుంగ కుండ నయ్యాజ్ఞసేనిం బ్రోచెఁ గాదె. దుష్టుఁడగు దుస్ససేనుండు వేణిఁ బట్టియీడ్చి వలువ నూడ్వఁ, గర్ణదుర్యోధనులు గర్వాంధ్యంబున రాఁబోవు తెఱం గెఱుంగ కతినీచోక్తు లనేకంబు లాడ, నక్కట్టిఁడి పలు వల తులువతనంబులకు దిగులొంది సభ్యు లొండొ రులతోడం గుసగుసలఁ బోవఁ దా మిన్నకుండి, య య్యన్నులమిన్న మదద్విరదోచ్చలితశుండాదండవిపా టితపద్మినీమతల్లికవోలె నా నీచదుశ్శాసను కరం

బులకుఁ బట్టుపడి తూఁగాడి బలం బుడిగి విడిపించు
కొను వెరవెఱుంగక నిజపతు లేవురు సమయ
బద్ధులై మంత్రబద్ధభుజంగంబులకై వడి రోఁజు
చుఁ జేయునదిలేక తలలువాంచి పుడమిఁ గాంచు
చుండ నశరణశరణ్యుండగు గోపాలవరేణ్యుండె తన
కత్తఱిదిక్కు కానోపువాఁడని యెఱింగి చీరపట్టు వీడి
చేదోయి మోడ్చి యుఁబోణినివలెఁ గన్నులరమూసి
యాద్వారకావాసు, మునికీర్తనోల్లాసు, నిజ హృద
యారవిందంబునఁ గీలుకొలిపి ధ్యానించుడు నమ్మందర
ధరుం డమందకారుణ్యామృతాసారంబు లొలయించి
యమ్మందగమన వలువ నక్షయంబుగం బెంచి మాన
భంగంబు గాకుండఁ బ్రోచి యాదుస్ససేను విఫల
మనోరథు నొనర్చెఁగాదే? కాలు జాఱి వాహినిం
బడి బలం బుడిగి యీఁదులాడనేరక నలువైపులఁ
గొట్టుపడి ప్రవాహంబునఁ గొట్టుకొనిపోవు దీనునిఁ
జూచినప్పుడె మనుపక ప్రాణావశేషుండయి నీట
మునుఁగనైన యప్పుడ ప్రోవఁ దలపోయు వెడఁగులుఁ
గలరే? లోకరక్షకుఁడగు పక్షివాహనుం డప్పద్మాక్షికిఁ
దొట్టిన యిక్కట్టులఁ దొలఁగునె పాప నెన్నక మిన్న

కుండి యీ దుస్ససేను కరస్పర్శనంబునఁ బరితపించి, యాదుర్మదులగు రాధేయ సుయోధనుల నీచోక్తులను వాఁడి ములుకులఁ గలఁత నొంది, వస్త్రాపకర్షణంబున మానభంగంబు బొరయు నని మదిం జేడ్పడి దైన్యంబున మొఱలిడినవెనుక నమ్మానిని బ్రోవఁ బొల్పడనే! రామానుజుం డక్షయ జాలము సేసె?

లీల—మునీశ్వరా! ఔ నది యేల?

ముని—ఉవిదా! దీనికిం గారణంబు లనేకంబు లున్నవి. నే నొక్కయంశం బుపన్యసించెద సావధానత నాలింపుము. (విజయుం గాంచి) బాలకా నీయడిగిన ప్రశ్నకు నుత్తరం బొండొసంగెద నాకర్ణింపుము.

"మ. కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడైనట్టిదు
ర్బలుఁ డాపత్సమయంబున న్నిజపదాబ్జాతంబులుల్లంబులోఁ
దలఁపం దామది మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్స ని
శ్చలభక్తి న్భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్."

అని యున్నందునఁ దన్ను ననారతంబు ధ్యానించు పాంచాలి నాపత్కాలంబునఁ బాలించుటకు నగ్గరుడగమనుండు బద్ధుండు. ఐనం దమకు బలంబు లేమి నెఱింగి, యొండొరునిచేఁ బ్రాపుఁ గానమి నెడందఁ

దలపోసి, విపదంబురాశిఁ దరింప నఖిల లోకనాయకుం
డగు శ్రీమన్నారాయణుని పదాంబుజంబులె శరణం
బులని దృఢచిత్తంబున నిశ్చయించి, తక్కిన ప్రముక్కు
డుల రక్షణంబు వాంఛింపక, నిజప్రయత్నంబుల వీడి,
యయ్యాశరణశరణ్యుని నిశ్చలంబుగఁ జిత్తవీథిఁ బొందు
కొల్పి భజించుటె ప్రపత్తిమార్గంబని పెద్ద లెఱిం
గింతురు. తొలుదొల్తఁ గౌరవసభకు బలాత్కృష్టయై
వచ్చి నిలిచిన యప్పాండవధర్మపత్ని, సభ్యులు ధర్మాధర్మం
బులఁ బరికించి దుర్మదాంధ్యగుణశీలుండగు దుశ్శాసనుని
దురుద్యమంబు వారింతురని తలంచి గద్గదకంఠయై
దీనస్వరంబున నప్పరిషత్తు ప్రాఁపు వేఁడె. అంతం ధీ
నిధు లయ్యు సభ్యులు దుర్యోధనున కోడి యడ్డపడరైరి.
తననాథులు సమయబద్ధు లయ్యుఁ బ్రతిజ్ఞాభంగంబు
పాడిగాదను సామాన్యవిధికన్న నిజభార్యా మానసం
రక్షణం బవశ్యకర్తవ్యంబను విశేషవిధి యుత్కృష్టం
బని యెన్ని తన్నుఁ బ్రోవఁ దొడంగుదురని తలపోసి
తాఁ బరతంత్ర గావున వారిచాయఁ జూడ్కి నిగిడించె.
పాండవులు సమయంబ పెద్దచేసి యేమియుఁ జేయనో
పక యవనతముఖులై మిన్నకుండిరి. దుస్ససేనుండో

నిజాగ్రజ కర్ణశకుని ప్రమోదార్థం బనివార్యుండై య మ్మానినీమణి వసనంబు నూడ్వ మొదలుపెట్టె. అట్టి తఱినైనఁ బరిషత్తలంబున నెవ్వఁడైన నొక్కండు ధర్మాత్ముం డడ్డపడి యక్కట్టిఁడికిఁ దెలివిఁగఅపఁడేయని నలువలఁకులఁ జూడఁ దొడఁగె. అప్పుడును దిక్కుఁ గాంచక యాఁకొన్న సింగంబులనడుమఁ జిక్కుకొనిన జింకఁబోలి నలువైఁపుల వైరులు బలసికొని యుంటయు, నజేయులయ్యుఁ బతులు సమయ పాశం బును దెమలింప నేరక దీనులై యుంటయు, సభాస ములు ధర్మజ్ఞులయ్యు మోహాంబుధినిమగ్నులై మిన్నకుం టయుఁ దలపోసి తన బలిమికొలంది నాదుష్టుని వా రింపఁ జీర నొలువ నెడవిడాక చేఁ బట్టుకొని పెనఁ గులాడె. మాద్యత్సింధురంబు శుండాదండంబుచేఁ బద్మినీనాళంబు నూడఁబెఱుకు చందంబున నాధార్త రాష్ట్రుం డయ్యబలవలువల నతిసులభంబుగ నీడ్వఁ దొడఁగె. జలవిహంగిమచంచూవిపాటితనాళాంతం బునఁ గంపించు సరసీరుహంబు చాడ్పున నాసాధ్వీమ తల్లి తల్లడిల్లె. మృత్యువదన గహ్వరంబునఁ జొచ్చిన ప్రాణికి నేయౌషధంబులు నుపకరింపని కైవడిఁ దనకుఁ

ప్రాపయి యప్పాపి నడ్డగించు వారెవరును లేరని యెఱింగి మానరక్షణంబునకుఁ దానబల యగుటఁ దెలిసి, విశ్వాత్ముండును విశ్వమయుండును విశ్వంభరుండును విశ్వవేద్యుండునగు శ్రీమన్నారాయణుండు దక్క నింకొరులు తనకు మేలుసేయనోపరని తలపోసి చీరపట్టువీడి, చేదోయి ముకుళించి, యాద్యు ననవద్యు నార్తనతావనోద్యోగు నందితాఖిలయోగుఁ బవిత్రు సాధుజనమిత్రు నమేయు సనకసనందనాదిమునిగేయు లోకనాథు శ్రీవైకుంఠనాథు నేకచిత్తంబునఁ దలపోసి తదీయచరణయుగళంబుఁ జిత్తంబునఁ బాదుకొల్పి,

"గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ।
కౌర్వైర్గ్ల పరిభూతాం మాం కిం నజానాసి కేశవ।
హేనాథ హేరమా నాథ వ్రజనా ర్తినాశన।
కౌరవార్ణవమగ్నాం మా ముద్ధర స్వజనార్దన।
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన।
ప్రపన్నాం పాహి గోవింద కురుమధ్యే ఽవసీదతీమ్॥"

అని శరణంబు వేఁడుడు నయ్యార్తజనరక్షకుండు చీర నక్షయంబుగం బెంచి యాసాధ్విం బరిపాలించె. ఆపత్కాలంబున భగవత్ప్రపదనంబొండె శరణంబని యప్పాంచాలి యెఱింగి యావాత్సల్యజలధియగు గోవిం

దుని భజనంబు దక్క విపన్నివారకంబగు నన్యో పాయంబు లేదని వనజోదరుని ప్రాపు వేఁడె. అంత నతఁడు ద్రౌపదీ మానరక్షణంబునకుఁ గృతప్రతిజ్ఞుఁడయ్యె. ఇదియె ప్రపత్తిప్రభావము.

విజ—గురువర్యా! ఇదియె కదా శరణాగతి?

ముని—ఔను ఇవి పర్యాయపదంబులే.

లీలా—మునీంద్రా! భగవన్మహిమాదర్శంబగు తమ యుపన్యాసంబుఁ గ్రోలి నా వీనులు పరమ పావనంబులయ్యె. నా జన్మంబు పవిత్రంబ యయ్యె. ఇంకనుం దమ వచోలహరి నోలలాడు తమకం బెసక మెసఁగుఁ గానఁ బ్రపత్తిలక్షణం బేర్పడఁ దెలుపఁ బ్రార్థించెద.

ముని—అతి గోప్యంబగు నీయంశంబు నింతకన్నఁ బెంచి నీకుఁ దెలుపుట..............................

లీలా—యోగిసత్తమా! నేను వారవనితా గర్భంబున జననమొందియు నవితరయువతీజనలభ్యంబగు పరిజ్ఞానంబు గడించికొని యున్నదానఁ గాని కేవలాజ్ఞాననిధినిగాను.

విజ—(తనలో) ఔర! ఔన్నత్యము.

లీలా—నాతల్లి సరసాంగి సరససంగీతసాహిత్యవిద్యలఁ బె రెన్నికఁగన్నది. నేనును జఱుతనాటనుండియు నొక్క విప్రోత్తమునియెడఁ గావ్యేతిహాసాదులఁ గఱచినదాన. ద్వైతాద్వైతాదిమతసారంబుల నొక్కింత యెఱుంగుదు. పురాకృత దుష్కృతపరిపాకంబునం జేసి కర్మాను సారంబుగ నీవేశ్యాజన్మంబునకుఁ బొల్పడితిఁగాని వే ఱొండుగాదు. మఱియు నాకులంబునకుఁ దగిన జీవనంబు విడనాడుట పాడిగాదు. మున్ను పతివ్రతా జ్ఞాపితుఁడై తనయొద్దకునచ్చిన కౌశికునకు ధర్మవ్యాధుండను లుబ్ధకుండు తెలిపిన మాటల మఱచితిరే! వంశక్రమాగతంబైన కులాచారంబు వీడుట తగవగునే? హీనవంశజాతయుఁ బరమధర్మంబగు నిజకులాచారంబునఁ దవిలి వర్తించునేని నిర్మలయగుంగాని గర్హితయగునే ?..................................

ముని—చెలువా! నీవన్నమాటలు నిక్కంబులే యగును. నీబుద్ధికౌశలం బే నెఱింగితి. అతిగోప్యంబును గుశాగ్రబుద్ధులకేనిం బోధపడనిదగు నీప్రపత్తిప్రభావంబు నువిదల కుపన్యసింపఁ దగవగునే యని జంకెదఁగాని మఱి యొండుగాదు.

లీలా—యమిమండనా! అబలయగు పాంచాలి భగవదేకా ధీనతఁ దానుండుట నెఱింగి తదన్యోపాయ పరిత్యా గంబు నెఱపి భగవచ్చరణంబులె శరణంబులని ప్రపత్తిఁ జేసె నని యాఁడి, స్త్రీలకుఁ బ్రపత్తిమార్గంబు దురవ బోధంబనుట యాశ్చర్యజనకంబు.

ముని—ఇప్పు డీ వాదుమాటల తెఱంగుఁ జూడఁ బ్రపత్తి యిట్టిదని నీ వెఱుంగుట తెల్లమయ్యె. ఐన నాచే విన వలఁతువుగాన నొకింత తెలిపెద. శరణాగతి స్వభా వం బిట్లు వర్ణితంబయ్యె—

"అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాసపూర్వకమ్।
తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః॥"

కావున నితరులచేఁ బ్రాపుఁగాంచుట యుపకరింపమి నెఱింగి యీశ్వరకారుణ్యంబొండె దుఃఖాంబుధిఁ దరిం చుటకు నుపాయంబని నమ్మి వాత్సల్యజలధియుఁ బరమ కారుణికుండునగు శ్రీమన్నారాయణుని విశ్వాసపూర్వ కంబుగ భజించుటయె ప్రపత్తి యనంబడు. తొలుత జానకీదేవిఁ గారించిన కాకాసురుండు నిజాపరాధంబునం జేసి వధార్హుండెయయ్యు రామబాణంబు నిరోధింపఁ గమలభవభవాదుల వేఁడియుఁ బ్రాపు గానక పరిత

పెంచి గత్యంతరంబులేమి నెఱింగి రాఘవుని శరణంబు వేఁడి యాతనిచే రక్షితుండయ్యె. ముకుందుండు వా త్సల్యజలధి యగుట దోషంబునైనఁ బాటించువాఁడు కాఁడు. కావున నట్టి పరాత్పరునికిఁ బ్రపత్తి సలుపుట సకలాపద్దురితవిచ్ఛేదకంబు. ఇట్టి ప్రపత్తిమార్గంబును వసిష్ఠునిచే నుపదిష్టమైన యాజ్ఞసేని వస్త్రాపకర్షణ సమయంబున—

"మహత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః।
జ్ఞాతం మయా వసిష్ఠేన పురా గీతం మహాత్మనా॥"

అని తనయందుం దలపోసి చీరపట్టువీడి నిర్గలాత్రయై

"హా కృష్ణ ద్వారకావాసిన్ క్వాసి యాదవనందన।
ఇమా మవస్థాం సంప్రాప్తా మనాథాం కి ముపేక్షసే॥
శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాఽచ్యుత।
గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగతామ్॥"

అని సకరుణంబుగ మొఱలిడ నిందిరారమణుండు కరుణించె.

లీలా—సంయమీశ్వరా! తమచే నుదీరితంబులైన సదు పన్యాసంబుల విని నా యుల్లంబు పల్లవించె. శ్రీజగ న్నాధ చరితామృతాస్వాదనం బెవ్వరి నానందసందో హంబున నోలలాడఁ జేయదు?

" క. మోదనములు దుర్గతివి
చ్ఛేదనములు సకలకార్యసిద్ధిశ్రీసం
పాదనములు జగదేకా
హ్లాదనములు చక్రపాణియభివాదనముల్. "

" క. ప్రేరకములు సుకృతములకు,
వారకములు దుష్కృతుల; కవారితవిపదు
ద్ధారకములు భవసాగర
తారకములు జనుల కచ్యుతస్మారకముల్. "

" క. లాలనములు సతులకుఁ; బరి
శీలనములు భువనములకు; సిద్ధులకుఁ గరా
స్ఫాలనములు ముక్తిరమా
ఖేలనములు శౌరిచారుకృతచాలనముల్. "

" క. నర్తనములు సిరులకు; భవ
కర్తనములు దివిజరాజకార్యక్రమసం
పూర్తనములు జనదురితని
వర్తనములు యాదవేంద్రవరకీర్తనముల్. "

అని యొక్క పూర్వకవివర్యుండు భక్తిపరత్వంబున నాడి నట్లు శ్రీమన్నారాయణదివ్యచరిత్రాకర్ణనంబు సకల దురితవిచ్ఛేదకంబుగాదే.

విజ—(మునిం గాంచి) గురువర్యా! తమచే నుపన్యసింపఁ బడిన సద్విషయంబుల లీనమైన నామనం బింతదనుక

మరలమి స్నానాద్యనుష్ఠానంబులకు విధ్యుక్తకాలం బాసన్నమగుట నెఱుఁగనైతి.........

ముని—బాలక! నన్నుం జక్కఁగఁ బ్రబుద్ధుం జేసితివి. ఇఁక మన కిందుఁ దడయఁ దగదు. లెమ్ము......

లీలా—యోగివర్యా! నాశక్తికొలంది నేను జేయుపరిచ్యల నందికొని వెడలఁదగును. (అని మునికిఁ జేదోయి ముకుళించి దాఁపుననె నిలుచు తనచేటికిఁ గనుసన్నఁ జూపును.)

ముని—బాలా! వచ్చినప్పుడె మమ్ము వందనాదులఁ బూజించి గౌరవించితి వది చాలదా?........(లేచి)....

చెలువా! కాలయాపనం బగుట నొక్కింతయైన నిఁక నిందుఁ దడయలేము. వలయునేని స్నానజపాద్యనుష్ఠానంబుల నెఱపి మాయాశ్రమంబున కేగుతఱి నిందు నిలిచెదము......(విజయుం గాంచి) బాలకా! ఈ సంచి నిందుంచి పోవుదమా?

విజ—ఇందిది యుంచుట తగవగునేని మీయిచ్ఛచొప్పునఁ జేయుఁడు.

లీలా—మునీంద్రా! తమరు వచ్చువఱ కతిజాగ్రత్తగ దాఁచి పెట్టెదను. నాచేతి కిందు. తమశిష్యున కేల సంశయము?

మునులధనంబు నపహరించునోకో యని శంకించుచు న్నట్లున్నది.

ముని—ముగుదా! నీవు దప్పుదలంచితివి. మముబోలు నిరాహారులయెడ సిరి నివసించునే? శ్రీమన్ముకుందపదా రవింద ధ్యానానందకందళిత స్వాంతులకు ధనంబు చం ధనంబకాదే. మాకు నబాధనంబును సుసాధనంబును ధనఞ్జయవివర్ధనంబునగు గోవర్ధనసమారాధనంబై పర మధనంబగుటం గవితార్కిక సింహులగు నిగమాంత దేశికగురులలాములచే రచితమైన వక్ష్యమాణ శ్లోక రాజంబు సంతత పఠనీయంబు:

"నాస్తిపిత్రార్జితంకిఞ్చిన్నమయాకిఞ్చిదార్జితమ్।
అస్తిమేహస్తిశైలాగ్రేవస్తుపైతామహంధనమ్"

ఈధనంబె నిరపాయంబును, ముక్తిసాధనోపాయంబును, సనకసనందనాదియమి గేయంబును సిద్ధజనధ్యేయంబు నై చెన్నుమీఱు........................
వనవాసులగు జడదారులయెడ సకలరుజలం బోగొట్టు మూలిక లనేకంబు లుండు ననుట నీవెఱుగవే?

లీలా—ఈ సంచి నవి యున్న నపహరింతునా?

ముని—నామాటలను సాంతముగ వినుము. వీనిని నీవ పహరింతువను శంక కాదు. ఈ మూలికలతో నొక కొన్ని రసములున్నవి. మఱియుఁ గొన్ని గుళిక లున్నవి. వానిలో నొక కొన్ని చెడువిషములు గలవు. అవి యుపయోగించినమాత్రన చావు సిద్ధంబగుట నేరైన నెఱుక లేమిఁ దిని యిలఁ బాయుదురో యనుభయంబున నీసంచి నెవ్వరిచే నీయక నాచంకనె యుంచికొని యుందు...............

లీలా—అభయము వలదు. ఎవ్వరిచేతికి దొరకనిభంగి నాపడకింట దీనిం దాఁచెదను.

ముని—(లీలావతిచేతికి సంచి నిచ్చి) జాగ్రత్తగ దాఁచి పెట్టుము. బిడ్డలు...............

లీలా—బిడ్డలు నాకు మొదలే లేరు. కాన నా భయము వలదు.

విజ—(తనలో) పీడ వదలెను. లంజెలకు బిడ్డలు తగులాటములు.

ముని—నీపడకింట నొక్క పెట్టియం దాఁపుము. శీఘ్రముగనె తిరిగి వచ్చెదను. (అని వెడలఁ బోవును.)

విజ—గురువరా! నన్నైన నమ్మి యీ సంచి నాచేతి కెన్నఁడు నియ్యరు. నేఁ డేల యింత శంకతో నిమ్మగువచేతి కీయవలయును? మనమె తీసికొని పోరాదా? ఇది యొక బరువా?

ముని—(డోలాయమానమానసుండయి యొక్కింత నిలిచి) దిగులు వలదు. పోవుదము రమ్ము. (అని రెండడుగులు నడచి తిరిగి చూచి) ముగుదా! జాగ్రత్త జాగ్రత్త సుమా.

లీలా—(నవ్వి,)

చ. మునివర! శంక వీడుఁ డిదె ముందర దాఁచెద సంచి; నేల మీ
మనము గలంగ! నాపలుకు మాన్యమె గాని యసత్యమా నాకో?
కొనుఁ డివె వందనంబు లిఁక గొబ్బున వచ్చెద రింతయేల! నె
మ్మనమున నెమ్మిఁ దాల్పుఁ డనుమానము వీడుఁడు పొందు గంగకుణ్.

ముని—సరి. ఇంతియె చాలును (అని విజయునితో వెడలును.)

---

# కనకాంగి.

## తృతీయాంకము.

తృతీయరంగము—లీలావతిగృహము. అభ్యంతరమందిరము.

[ప్రవేశము: లీలావతి.]

లీలావతి—(స్వగతముగ) దుర్బుద్ధి! దుర్బుద్ధి! నన్నేల యీ కట్టిఁడితనంబునకు నొడికట్టఁ బెరరేఁచెదు! నా కిప్పు డున్న యీవైభవంబులు చాలవా? నృపునకు నామా టలు వేదవాక్యంబులు. అడవియందుఁ దిరుగాడు నె ఱుకు నొక్కని సేనాని నొనర్పఁ దలంచితినేని నిముసం బునఁ జేయఁగలను. చిరకాలంబుగ మంత్రిపదంబునఁ బేరొందినవాని నడఁగఁద్రొక్క వలఁతు నేనిఁ దలఁచినం తన యటులొనర్పఁగలను. ఈ రాజ్యమంతయు నాయ ధీనంబ. ఈప్రజలు నన్నెంత దూఱనాడినను నసుంగాం చిన మాత్రన వాతపాతంబునఁ దూఁగాడు తీఁగెలంబోలెఁ జలించువారు. ఈ మదనుఁడు జంత్రపుబొమ్మవలె నా యిచ్చకనుగుణంబుగ నడచుకొనును. దుర్బుద్ధి! నిన్నె

రాజ్యంబున ముఖ్యునిఁ జేసితి. నేను రాజేంద్రునిఁ జేరుటకుమున్ను నీవు మదనుని నెయ్యుఁడవై యుంటివి. ఇప్పుడు నీవు నృపసభాతలంబునఁ బ్రథమగణ్యుండవైతివి. దీనికిఁ గారణ మేనుగాక మఱియెవ్వరు? తొలుదొల్త వున్నీ నాకుఁ జేసిన సాయంబునె పలుమఱుఁ దలంతువుగాని నావలన నీవు గడించిన పదవిం దలపోయవు. ఇంకన్నిను రాజకీయాధికారంబుల మిన్ను ముట్టించెద. ఇదెంతటికార్యము? తలఁచినంతనె సేయఁగలను... కనకాంగికేపాటి చనవున్నది? మదనుఁడు దాని మోముఁ జూచి యెంతయో కాలమయ్యెను. (అద్దమునఁ దనసొబగుఁ గాంచి) నావిలాసముచేతను, జక్కదనంబునను, జమత్కారవాగ్జైపుణివలనను బుడమిఱేని మోహితునిఁ జేసి, భుజలతావల్లరులచే బంధించి, వీక్షణాశుగంబుల హృదయవిదళనంబుఁ గావించి పట్టుపఱిచి—ఇంతయేల? మేరలేని యొయ్యారంబుల నమ్మదనుని బాలప్రాయునిఁ జేసి నా కార్యముల సాగించుకొందును. పట్టమహిషియె యైనం గనకాంగి కీయుపాయంబు లలవడునా?....మగఁడు తనకు వశ్యుఁడుకామికిఁగనకాంగి చింతిల్లునఁట! ఇదిస్త్రీలకు స్వభావమేగదా!

పురుషుని మనం బాకర్షింపఁగల్గు సొబగు తమకుఁ గల్గమి నెఱుంగక "అయ్యో! నాథుఁడు నా మోమైనఁజూడఁ డే; ఆ యొయ్యారికి వశ్యుఁడయ్యె నే!" యని వాపోవుట బుద్ధిలేని కుటుంబినులకు సహజము............... కనకాంగి యెంత పదరిన నా కేమి? రాజు నన్ను విడుచునా? దానిం జేరం దలంచునా? ఒక్కనాఁడును నన్ను విడువఁడు. దానిం జేరఁబోఁడు. ఇది నిశ్చయము. అట్లుండ దీని కే నేల యాపదఁ దలంపవలయు? అట్లు తలంచుట బుద్ధిలేనిపని......దుర్బుద్ధి! ఇఁక నన్ను నమ్మకుము. ఈ క్రూర కార్యంబున కే నొప్పను. నీ యిష్టమైన ట్లొనరించుకొనుము. కనకాంగిని విషముచేఁ జంపుటయా! ఔరా! ఇది నా చేతఁగాదు. ఎన్నటికిని గాదు. ఇక్కఠిన కార్యమునకు నాకు సాయపడుటకై నీవు తెచ్చిన యా రదనిక నిప్పుడ పోఁగొట్టెద. నా కేల యీ యపనింద? కొదవలేక వైభవంబుల మెలఁగునే నేల యిట్టి చెడుతలపోఁతలకుఁ దొడంగవలయు?... మునీంద్రుం డానతిచ్చిన పగిది నీశ్వరధ్యానంబె సంసారబంధవిమోచకంబు. ఇప్పుడొక్కింత మున్నె విన్న యమివాక్యంబుల నింతలోనె మఱచి దుర్వ్యాపారంబు

లకుఁ దొడంగుట పోలునే? ఇఁక దురుద్యమంబులను వీడి, మదను నె ప్రాణేశునిఁగఁ దలపోసి, యొండొరులఁ గన్నెత్తిచూడక సద్వృత్తిఁ జరించి, హరిపదారవిందం బులయెడ భక్తి సలిపి, యీ దుష్టతనువుఁ బాసి, పవిత్ర నొటయె కర్తవ్యము. చిన్ననాట నొనగూడిన గాంధ ర్వవిద్య యనుకూలింప, నిర్యోగిఁబోలు సాధువులకు సపర్య లొనర్చి విపన్నివారకంబులగు ముకుందగుణ గణకథనంబుల నాత్మ నెమ్మి నెక్కొల్పి యజ్ఞానతిమి రంబుఁ బోదట్టి యప్పురాత్పరు నధికభక్తి గానసంపత్తి చెలువాఱఁ, దాళమురజాద్యుపకరణంబులు చెన్ను మీఱఁ దంబుర మీటి శ్రుతిఁగూర్చి, కాలోచితంబుల గునౌడవ షాడవ సంపూర్ణ రాగంబుల మూర్ఛనలు దేఱ, స్త్రీపురుషరాగంబుల రక్తిమీఱఁ, గాలమార్గక్రి యాదితాళదశప్రాణముల ననుసరించి, తిరిపస్ఫురితకధి తాదిగమకంబులు చెలంగఁ, గీర్తించి కాలంబుఁగడ పుదు... దుర్బుద్ధీ! కనకాంగినిఁ జంపుటయా?...... దీనిచే నాకు రాఁగల ఫలంబెద్దియో యెఱుంగను. అట్లుండ నీకార్యంబునకు నేనేల పూనుకొనవలయు? దైవఘటనంబునఁ బడుపుఁజేడియనై పుట్టినంతన నీతికి

వెలి కానగునా?........(పుడమిఁ బరికించి) ఇక్కార్యంబున కే నొప్పనియెడ దుర్బుద్ధి యేమి సేయఁ దలంచునో? ఇదియె మనంబును గలంచుచున్నది. తాను బలికినట్లు నాకుఁ గీడుసేయునేమో?........ ఇది యతనిచేఁగాదు. ఇంక నాపై నితఁ డెంత పలికినను రాజు వినఁడు......అట్లెట్లు నమ్మవచ్చును?... నృపున కీతని నెంతయు నముంగుఁ జేసితిని. ఇది నాబుద్ధిలనితనము. ఒకవేళ నితనిమాటలను నమ్మునేమో?... నమ్మునా? నాకౌఁగిలి మఱచునా? నాయందలి వలపు వీడునా? ఇది దుష్టయని........మఱియొండున్నది. కనకాంగి యిప్పుడు గర్భిణియని దుర్బుద్ధి పలికెఁగా? పుత్రోత్సవమున నన్ను మఱచి మదనుఁడు కనకాంగికి వశ్యుఁడగునో? పుత్రోత్సవ మన్న నెట్టిదంపతులకు నొకకట్టు గదా? ఇది యింతవఱకు మఱచితిని. అతనికి నింతదనుక నే నొక్కతనె ప్రాణపదంబన నెగడితి. ఇఁక నొక నిసుఁగు పుట్టిన ననురాగం బట్లు తిరుగునేమో? తిరిగిన నా గతియేమి?............నాగతి యేమి?...ఈ విభవంబులు నాకు నిల్చునా?...... ధరణీధవుం డిప్పటివలె నన్ను మన్నించునా?......

నామాటలను బాటించునా? నాయందుఁ గూరిమి నిం చునా? అక్కటా మనంబు శంకాకులంబగుచున్నది. బుద్ధి మందమగుచున్నది............అట్లైన నాగతి యేమి?.......వచ్చినత్రోవనే తిరుగ వలయు...ఇది నిక్కము. ముమ్మాటికి నిక్కము......ఔరా దుర్బుద్ధి మాట లనుగ్రహణీయములు. ఇఁక వెనుదీయరాదు. నిర్మలసుధారచిత హర్మ్యతలంబులఁ జరించుటలు మాని మున్నువలె నతినీచపర్ణకుటీరంబుల నింకఁ గాలంబుఁ గడపుదునా? నవరత్నఖచిత రుచిరాభరణంబులఁ గోలు పోయి మగుడ రిత్త మనుగడ విలపింతునా? వివిధకు సుమవిసరపరిమళవాసితంబగు నిష్కుటవిహారంబుల నెడలి యల్పకుటీరపురోభాగంబున మెలంగుదునా? గణనాతీతనతనృపమకుట మణిరంజితపాదసరోరుహుం డగు రాజేంద్రునిఁ గూడి హంసతూలికా తల్పంబున నిద్రించుటలు మాని నీచవిటజనపరిరంభణంబుల మరగి క్రుక్కిమంచంబుల నిదురింతునా? వీక్షణసం జ్ఞన యఖిలకార్యంబులు నడపించుకొనుటలుదొఱంగి యలఁతియగు నాట చేడియనై తలవంచుకొని...వల దువలదు. ఇట్టి తలపోఁతలు వలదు. వలయుననియిట్టి

వైభవం బార్జించుకొని యేల విడువనగును? విడువఁ దగదు—విడువఁదగదు. ఎట్టి కార్యమునకైనఁ బూని యిట్టులె వైభవోపేతనై మనవలయు. కనకాంగిని జంపఁదలఁచుట క్రూరకృత్య మనుకొంటి. దానిం జంప కున్న నను నేన చంపుకొనుటయె కాదే? చంపుట క్రూరకృత్యము. మనల మనము కాపాడు కొనుట ముఖ్యకృత్యము. కనకాంగికి విస మిడక యిది కొన సాఁగదు. కారుణ్యమా! నీవు నన్ను విడువుము. నిను నమ్మిన నాస్థితికి హానివచ్చును. దేవా! నాకు ధైర్యముఁ గూర్పుము. నా స్వాంతమును గండశిలాప్రాయంబుఁ జేయుము. నా యుల్లంబునఁ గల తల్లడంబు మాన్పు ము. నా కార్యంబు నెఱవేర్పుము. దుర్బుద్ధి! దుర్బుద్ధి! దుర్బుద్ధి!

( తెర పడును )

---

# క న కాం గి.

## తృతీయాంకము.

### చతుర్థరంగము—శయన మందిరము.

[లీలావతి ముని సంచిఁదెఱచి చూచుచున్నది.

లీలావతి—ఈ సంచి నిండుగఁ జిన్న చిన్న బరణులున్నవి. (ఒక బరణినెత్తి) దీనిలో నేమున్నదో? ఇదె విలాసమున్నది—"తలనొప్పికి"—తలనొప్పికా!— నా తలనొప్పి దీనివల్ల వీడునది కాదు. (సంచిలోఁ బెట్టి మఱియొక బరణి నెత్తి) దీన నేమున్నది? ఇదె విలాసమున్నది. దీనిం జదువుట కలవి కాదు. జిలుగక్షరములు. ఐనఁ జూతము — పీ— న — వెనుకటి యక్కరము తెలియలేదు. ఆవల—ము. ఇది పీనసమని యుండునో? అట్లేయుండఁదగు. ఇదియు వలదు. (అని దానిం బెట్టి యింకొక్కటి నెత్తి) ఇది యేమి? "ఉబ్బసమునకు మందు" సరి; ఇదియు వలదు. ఇది యెట్టిమం

దు? (ఇంకొకటి నెత్తి) ఇది యేమి? దీనిపై నెఱ్ఱని కాగి
తము చుట్టఁబడియున్నది? అవన్నియు నిట్లు చుట్టఁబ
డవు. (విప్పి) విలాసము నెఱ్ఱనిరంగు కాగితముపై ను
న్నది. ఇది యేమో? (చదివి) రూమ—రూమటి—
రూమ—రూమటిస్మ—రూమటి—అక్షరములు తెను
గు—రూమటిస్మం—ఇది యేమి భాష? తప్పుతప్పు.
రొమ్మునొప్పి యని యుండునొండె నిదిగో సరిగ్గా
యుండవచ్చును. వైద్యభాషలో ''రూమ'' యన్న
రొమ్మేమో? ''టిస్మం'' అన్న? నొప్పియనియుండును.
ఇది వైద్యశాస్త్రపరిభాషల నెఱిఁగిన వారికిఁగదా
తెలియును. సరిగాని యిది చమురువలె నున్నది.
త్రాగుటకా పూయుటకా? ఇదె విలాసముఁ జూడఁ
దెలియుచున్నది. ''దీనిని నొప్పిగలచోట రాయవల
యును. త్రాగరాదు'' ఓహో త్రాగరాదో? త్రా
గిన? చావా? మందు పనిచేయదా? సరి యిది
యట్లుండనీ. (ఒకచోటఁ బెట్టి) సన్యాసులు చికిత్సా
శాస్త్రమునఁ బ్రవీణులని విని యున్నాను. ఇదియేమి
దర్శనము. ఔరా? ఇంకెన్ని మందు లున్నవి! ఇదియేమి?
మఱియొకటి? ''జ్వరాంకుశము'' ఇది మనకేల? స్మరాం

కుశలము మనకు ముఖ్యము. ఇంకొక్క బరణి నెత్తి మఱియు నిదియో? "వాతభైరవము" అబ్బా యెంత పెద్దపేరు—ఈ సంచిలో ననేకములగు విషములు గలవని చెప్పెనే యా మునివరుఁడు. ఇదివఱకొక్కటి యైన దొరకలేదే? ఇంకను జూతము. ఇదె యెఱ్ఱని కాగితముతోఁ జుట్టఁబడినబరణి యింకొక్కటి. దీనిలో నేమి? (కాగితము విప్పి) అదిగో—విషము—అని పెద్దయక్షరములతో వ్రాయఁబడియున్నది. ఇదేమిమందు? క్రింద నేమో వ్రాయఁబడియున్నది. ఇదియే రోగమునకో? (చదువుటకుఁ బ్రయత్నించి) జిలుగు జిలుగు—ఏలయిట్లు వ్రాయుదురో? కొన్ని బరణులపైఁ జక్కఁగ వ్రాయఁబడియున్నది. ఇంకొక్కపరి చూతము. కష్టము, ఇది చదువుట కష్టము. ఇది యేమి మిక్కిలి చిన్నయక్షరములతో నేమో వ్రాఁతయున్నది? మూఁడు బంతులున్నవి. మొదటి రెండుబంతులు చదువలేను. మూఁడవబంతి—"త్రాగిన"—ఇంకేమి? "మరణము." ఇంక నేమోయున్నది "రెండు—రెండు" ఇది యేమి "రెండు రెండు" అని రెండుమాఱులు వ్రాయఁబడియున్నది? "రెండురెండు—బొట్లు—లే చాలును"

సరి. భోధపడెను. రెండుబొట్లు త్రాగినంతనే మరణము సిద్ధము. "రెండురెండు" అని యున్నందున నాలుగు బొట్లుపయోగింతము. నాలుగననేల? పదిబొట్లెత్తికొందము. (తన యొడిలోనున్న చిన్నబరణిలో నిరువది బొట్లు పోసికొని) ఇంకఁజూడవలయునా? కావలసినది సులభముగ దొరకెను. మునిని జూచినంతనె యతని సాహాయ్యమున మనపని జయప్రదమగునని దుర్బుద్ధి పలికెను. ఇక్కార్యమున నతఁడెట్లు సహాయపడునని యు నిప్పని కతఁడొడఁబడునాయనియు శంకించితిని. దైవసాహాయ్య మొకటి యున్నదికదా? ముని సాహాయ్యమేల? దైవము కరుణింపఁగా నీ సంచి కామధేనువై నాకు వలసినదాని నిచ్చె. (చేత నున్న బరణిఁ జూచి) ఒకవేళ నిది గుఱి తప్పునేమో? ఇంక నేమైన నున్న నొకకొన్ని బొట్లెత్తికొందము. వలదువలదు. ఇదియె చాలును. విషమని యీ బరణిపైఁ జక్కఁగ వ్రాఁత యున్నది. శంకింపఁ బనిలేదు. మునియు వచ్చుసమయమయ్యెను. ఇంకఁ దామసింపఁ దగదు. నేఁడు రేయి దీని దుర్బుద్ధిచేత నిచ్చెదను. రేపన్న మనస్సెట్లుండునో. మనగ్రహచారంబు నమ్మరాదు.

తే. మనము కరుణించు నొకవేళఁ, గనలి క్రౌర్య
మునను జెలరేఁగు నొకవేళ, మూర్ఖగతిని
గలఁగి తడఁబడు నొకవేళఁ, గరము భ్రమసి
సంచలించుచు నొకవేళ నించు పగలు.

ఎవరో వచ్చిన ట్లున్నది. (అని సంచి సవరించి బరణి దాఁచును.)

[దుర్బుద్ధి ప్రవేశము.]

దుర్బుద్ధి—లీలావతీ!

లీలా—ఓ—దుర్బుద్ధి! నీవా. ఎవరోవచ్చిరని దిగులొం దితి. మన కార్యము సఫలమైనట్లు తలఁచికొనుము.

దుర్బుద్ధి—సన్యాసితో మాటలాడితివా?

లీలా—సన్యాసి యేల?—

దుర్బుద్ధి—మఱి?

లీలా—ఈ సంచి—సన్యాసిసంచి—కల్పతరువువలె మనకు వలసిన వస్తువునిచ్చె.

దుర్బుద్ధి—అది యేమి (మెల్లన) విసమా?

లీలా—(అంగీకార సూచకంబుగఁ గన్ను గీటును.)

దుర్బుద్ధి—ప్రయోగ మెన్నఁడు?

లీలా—నేఁడే.

దుర్బుద్ధి—భళిభళి—నీ ధైర్యమునకు మెచ్చితిని. ఇంత శీఘ్రముగఁ గార్యసంవిధానంబునకు నిశ్చయింతువని యెఱుంగనైతి.

క. కమ్మనితావుల నలరుసు
మమ్ముల వ్యాళములు డాఁగి మార్గలయునటుల్
కొమ్మల హృదయాబ్జంబులఁ
గ్రమ్మినసాహస మొరులకుఁ గానఁగ నౌనే!

లీలా—నీ బుద్ధి వినినందుల కిదియా ఫలము?

దుర్బుద్ధి—లీలావతీ! కోపము వలదు. నే నేమంటిని? స్త్రీలయాలోచనల నెఱుంగుటకుం బురుషుఁడు చాలఁ డంటి. ఇది నిక్కంబె కదా?

లీలా—నీవ నను నికార్యంబునకుఁ బెరరేచి యిప్పుడిట్టు లాడెదవా? ..........................

దుర్బుద్ధి—అది యట్లుండ నిమ్ము. నీతో నొక కొన్ని మాట లాడవలసి యున్నది. యభ్యంతర మందిరంబున కరుగుదము రమ్ము.

(ఇరువురును వెడలెదరు.)

---

# కనకాంగి

## చతుర్థాంకము.

ప్రథమరంగము—కనకాంగి శయనమందిరబహిర్గప్రదేశము.

[రదనిక విసముగల బరణితోఁ బ్రవేశించుచున్నది.]

రదనిక—(తనలో) నేనేల యిట్టి పనికి నొప్పితి....కన కాంగీసతిం జనులు పలువితంబులఁ బొగడరే...అట్టి యన్నులమిన్నకుఁ గీడుసేయఁ దలపోయ నగునా!..... నా చేతల కీశ్వరుఁడు సహించునా?...పట్టుపట్టి యీ మహాకార్యంబు నెఱపితినేనిఁ దత్ఫలంబు ననుభవింప వలయునే...ఉన్న కష్టములు చాలవా? ఉన్న కష్టములా? అక్కటా! అవిగదా నన్నింతకుఁ దెచ్చె...దుఃఖాం బుధి నిట్లు మునింగి పరితపించు నా కీశ్వరుఁడు కలఁడో లేఁడో యను శంక వొడముచున్నది. ఈశ్వరుఁ డొక్కఁడు కలఁడేనిఁ గొందఱ అనుపమసుఖవాసం బులఁ బొరలుచుండ మఱికొందఱు నిరుపమచింతోర్మి కలఁ దూఁగనేల? ఈశ్వరునికి జనులెల్లరు సములు

కాంతే! పూర్వకృతంబుల కనుగుణంబుగ ప్రాణులియ్యెడ సుఖదుఃఖంబుల ననుభవింతురని పెద్దలు చెప్పెదరు గాని యందలి తాత్పర్యంబు తెలియంగ... ఇట్లు శంకాకులిత మనస్కుడనై తామసించుట తగదు. కార్యంబు నెఱవునదియు గానిదియు దైవంబ నిశ్చయింపవలయు.........ఇప్పుడివలని లాభంబెట్టిదైన నాకు వలదని యీ బరణి చిక్కి పడవైచి యుఱుకుదునా? (ఉలికి దేహంబు వణకి ముందుసూచి) దుర్బుద్ధీ! దుర్బుద్ధీ! ఇందేల వచ్చితివిరా? ఏమంటివు? కరిమెత్తి పలుకుము. ఔను. నీ వన్నది నిక్కము. పది వేల నిష్కంబు లూరక రావు. నా కవి వలదు..... దుర్బుద్ధీ! దుర్బుద్ధీ! కరుణింపుము. కినియవలదు. నీ తోడం గూడి యింతకుము న్నెన్నియో క్రూర కృత్యంబులఁ జేసియున్న నా మనం బెఱుంగవా? వలదు వలదు కోపంబు వలదు ఏమిసేయవలయునో తెలుపుము—ఏమనెదవు—మున్నే తెలిపితినంటివా? సరిసరి. బుద్ధి మఱచెను. దుర్బుద్ధీ! ఆ నిగనిగలాడు ఖడ్గము నొఱను బెట్టుము. దాని జూచినంతన మనంబు గలంగుచున్నది. కాయంబు వడంకెడుం దొడంగె. బలంబు

దప్పి చేతులు—ఇదియేమి? నా చేత నేమున్నది? ఆహా! దుర్బుద్ధీ! ఎఱుక తిరిగె. ఇదె నీ విచ్చిన విసము నాచేత నున్నది. ఇదె నీ యాన చొప్పున నెఱవేర్చెద. సంతసించెదవా? ఏమంటివి? ఔను. నీవన్నది నిక్కము. పదివేల నిష్కంబులు నా కెట్లు వచ్చును. ఇట్లే వచ్చు ననెదవా? ఆ-నిలుము నిలుము. ఇప్పని సేయ నేని ముందు నీకు సహాయ నై నేనొర్చిన కట్టెఁడిపనులఁ జాటించి నను దండింతునంటివా? అయ్యో దుర్బుద్ధీ! వలదువలదు. నమ్మినదాని నిట్లుసేయుట నీకుఁ దగదు. ఆ కత్తినేల యట్లు జళిపించెదు? వలదు—దాని నోఱ నిడుము—నీయాన నెఱపెదను. ఇఁక వెనుదీయను—వెనుదీయను (అని కాళ్లు దడఁబడ గోడపై కొరఁగి వెనుకఁ జూచి యదరిపడి లేచి నిలిచి తెల్లబాఱి) ఇది యెవరు? కనకాంగియా?—దేవీ నిను నడిరేయిఁ జంపనొడికట్టిన కట్టెఁడినగు ననుఁ బట్టుకొనుము. నా దురాలోచనలు ఫలిసె. (ఒకప్రక్క నంగుళిఁజూపి) ఇక్కార్యంబునకు ననుఁ బెరరేచినవాఁడు..................

అయ్యో దుర్బుద్ధి మాయమయ్యెనే అతఁడెట్లుపోయె? (తిరిగిచూచి) కనకాంగీ! నీవును గన్నెఱంగితివే? ఎందే

గితివి? (భయమున నలుప్రక్కలఁ జూచి) అయ్యయో! ఖడ్గసహస్రంబుల నిట్లు నా తలచుట్టు నిలిపెనా దుర్బుద్ధి! ఇఁక నెట్లు తప్పించుకొందు? కత్తులివె మించు లవలె మెఱయుచున్నవే! అవె యవి సంచలించుచు నా కంఠమును సమీపించుచున్నవే! ఏమిసేయుదు? దుర్బుద్ధీ! దుర్బుద్ధీ! వీనిం బిలువుము. ఇదె కార్యంబున నుద్యమించెద. నమ్ముము నమ్ముము. (అని యొకతలుపుఁ దెఱచి) అదె కనకాంగి నిదురించుచున్నది. ప్రక్కనే యొకపాత్రయు నున్నది. (అని మెల్లన నడచి యాపాత్రము దరిఁజేరి) ఇందు నీరున్నది. దీనిలోఁ బోయుదునా? ఈ పని తగదని విడిచిపెట్టుదునా? (ఒక్కింత విచారించును. కనకాంగి నిదురలోఁ గదలును) ఓ—కదలుచున్నది. లేచునేమో? తామసింపఁదగదు. (అని విషమును బాత్రములోఁ బోసి వెనుకకు వచ్చి గుమ్మము దాఁటి తలుపుమూసి తెల్లబాఱిన మోముతో నిలిచి) అయ్యో! ఎట్టిపనిచేసితిని! ఇప్పుడేమి సేయుదు? దాని ప్రక్క నీశ్వరుఁడు గలఁడేని నా నీరు త్రాగ... అది యేమి లోపల ధ్వని? (చెవియొగ్గి వినును.)

(తెరలోఁ గలకలము.)

లలితా! లలితా! లెమ్ము. ఈ యుదకమున నేమో యుండెను. లేచితివా? ఇంకఁ గొన్ని దీపముల వెలిఁగింపుము. ఆ పాత్రమును జూడుము—తల చుట్టుచున్నది. ఆ—పా—త్ర..............................

రదని—(ముంగొంగున మోముఁ గప్పుకొని యేడ్చుచు) ఆ పాపిమాటవిని...... త్రిప్పలేను...ఏమిసేయుదును? అదె యెవరో వచ్చునట్లున్నది. ఇట్టి ఘాతుకురాలిందు మసలఁ దగదు—దైవమా. (అని పరుగెత్తును. తెర పడును.)

---

# కనకాంగి.

---

## చతుర్థాంకము.

---

### ద్వితీయరంగము—రాజవీధి.

[రదనిక పరుగెత్తుచు దుర్బుద్ధిని డీకొనును.]

రదనిక—(ఒడలు వణఁక బెదరి నిలిచి) ఓసీ దుర్బుద్ధీ! నీవా? ఇందేమి సేయుచున్నాఁడవు?

దుర్బుద్ధి—నీ రాక కెదురు చూచుచుంటి. కార్యమయ్యెనా?

రద—ఛీ దుష్టా! నీ కూడిక నన్నింతకుఁ దెచ్చె.......

దుర్బుద్ధి—(రదనిక భుజములఁ బట్టుకొని కోపముతో) కార్యమయ్యెనా?

రద—చెడుగా! నీ మోమైన నింకిఁ జూడనోప. నీకు వశ్యనై సాధ్వీమణినిఁ జంపితి. నీశ్వరుఁడే నా యందుఁ గరుణింపవలయును.

దుర్బుద్ధి—(ఆనందమున) నీవుకదా కార్య విశారదవు (అని కౌఁగిలింపఁ బోవును.)

రద—(కౌఁగిలి కెడమీయక యదరిపడి దూరమున నిలిచి) చిలువతోడి చెలిమి నాకు వలదు. దూరమున నిలువుము. నిన్ను నమ్మి చేల నైతిని. చేల నైతి ననియా పలికితిని? ఘాతుకురాల నైతిని.

దుర్బుద్ధి—నీ కిప్పుడే తెలిసెనా? ఇట్టి బుద్ధిలేనిమాట లేల యాడెదు? నీ కిష్టము లేనియెడ నిప్పని సేయ నేర నని యప్పుడె చెప్పరాదా? అట్లు చెప్పక యేల యొప్పుకొంటివి? విసముఁ జేకొని యిట్లు వచ్చితివి గదా? మన కేల యీ పని యని కార్యము ముగించుటకు మున్నె తెలివి గలిగి యీ విష మటు పడవైచి

నీ త్రోవఁ బోరాదా? నీ విప్పునిఁ జేయవేని నీతలఁ దెగఁ గొట్టువా రెవరు? ఈ కార్యసంవిధానంబున నీకు రాఁగల లాభంబుఁ దెలిపితిని. దాని కామోదించి యిందుకుఁ బూనితివి. ఇప్పుడు నన్ను దూఱ నేల?

రద——దుర్బుద్ధీ! దుర్బుద్ధీ! కఠినహృదయా! దురుద్యోగంబున నొక్కింతుక మున్ను శంకించు నన్ను దిగులు కొలిపి యిక్కఠినకార్యంబు నాచే జరిపించి యిప్పుడిట్లు............

దుర్బుద్ధి——ఏమి? అది యెప్పుడు?

రద—ఇప్పుడ. కనకాంగి శయనమందిర బహిర్ద్వారంబున నేను నిలిచియుండ నొక బెడిదంపుఁ గరవాలంబుఁ జేతఁగొని నను వెఱపించి.........

దుర్బుద్ధి—రదనికా! నీకు మతి దరలె. ఇప్పుడె నా యిల్లు వదలి నీకై యిటు వచ్చితి. మతిభ్రమణంబున ధైర్యంబు వీడి.........

రద——ఇంతటిపాపమున కొడికట్టిన నీ కఠినశిరంబునకె నిరయంబు సిద్ధించు.

దుష్టబుద్ధి—(నవ్వి) పిచ్చి ముదిరెను. కార్యమో జరిగెను. నీవేల మొఱఁగెదవు. (పాఱునట్లు తన్ని) నీదుపక్షిలు చాలును ఇయ్యెడ బాసి నడపవేని నిను ఘాతుకు రాలని చాటించెదను. (రదనిక క్రిందఁబడి మెల్లన లేచి పాఱిపోవును.) నామనోరథం బీడేఱెను. కన కాంగియుఁ దగ్ధర్భస్థంబగు శిశువుం బోలియ నయ్యెను. ఇంక లీలావతియె పట్టమహిషి. నే నిఁక నల్ప కా లంబున నె రాజున కమాత్యుండ నయ్యెద. లీలా వతి నా యాజ్ఞలకుఁ దా నువిద యగుట నెంత శంకించి యెదు రాడినను దుదకు వశ్య యనునది. ఇది యెఱిఁగి కదా దాని మదనునకుం గూర్చితి. దాని నెప్పుడును త్రేల నాడింపఁ గలను. దాని సాయంబున నిఁక నవనీధవు నాడింతును. (ఘూకమఱ చును.) ఔర! ఇది యేమి ధ్వని? ఇం దెవ్వరును రాగు గదా!............ఏమి వేడుక! ననుఁబోలు ధైర్య శాలి కిట్టి దిగు లేల? కనకాంగి మరణంబునకు నన్నెవ రు పట్టికొందురు? (గూబ యఱచును) మఱల నదె ధ్వని. అది గూబ యఱపు. దీని కేల భయ మందితిని? గండశిలాప్రాయంబగు నా కఠినమన స్సిదేల కలంగఁ

జొచ్చెను?.........ఈ ఘూకంబు తలవరిచందంబున మాటిమాటికిఁ దర్శించురీతిఁ గూయఁ జొచ్చెను. మదనుఁడు మెత్తనివాఁడు. కనకాంగియొ సాధ్వీమణి. వీరికిఁ గొఱగామ లొనరించుకట్టిఁడి వధార్హుం డని యీ గూబ యీ చెట్టుతుట్టతుద నిలిచి చాటున ట్లున్నది. నిక్కంబుగ వధార్హుండ నైతి నంచుఁ దలంచెద. ఒరుల కన్నులు నానేరంబును జూడ కుండినను సర్వసాక్షి యగు నీశ్వరుం డెఱుఁగఁడే? నే నొనరించిన కార్యంబు మంచిదని యొక్కఁడైనఁ బలుకునే? దీనికిఫలం బనుభవింపక పోఁ జెల్లునే?.........అనుమానం బొక్కింతయు లేక ఘాతుకకృత్యంబు నెఱపి యిట్లిప్పుడు వాపోవనేల?.......మదనుని కీసడిఁ దెలిపి...... తెలిపిననేమి? దాన నానేరంబు పాయునా? సతీమణిం జంపిన పాపంబు వీడునా? తత్ఫలం బనుభవింపక తీరునా?.... లేదేని నిప్పత్తనంబు వీడి యెందేని మాఱువేసంబునఁ దిరుగుదునా? అక్కటా! అట్లగితినేని నానేరంబు ససాక్షికంబగును గాదే! ఇప్పట్టణ ప్రజలు నాయందిప్పుడె సంశయించువారు. విజయునిదొఱతనమికి నేనకారణంబని తలపోసి నన్నుం గన్న విషసర్పంబుఁ గాంచి

నట్లు తొలంగువారు. నే నుఱికిన వీ రూరకుందురె? (మఱల గూబ యఱచును) అహా! యీగూబ నన్నుఁ జంపఁ దలంచిన ట్లున్నది. ఇం దున్న మనంబు గలఁగుచున్నది. (అని వెడలును)

---

# కనకాంగి.

---

చతుర్థాంకము—తృతీయరంగము.

[మదనుఁడు తనశయన మందిరములో నొక జాబుతోఁ ప్రవేశించును.]

మదన—(తనలో) ఈ జా బెవరు వ్రాసియుందురు? ఇం దలివార్త నిశ్చయ మగునా? జాబు నింకొకపరిఁ జదివెదను. (చదువును.)

“ రాజేంద్రా!

తెలియమిచే లీలావతీదుర్బుద్ధులను నమ్మి వారికి లోఁబడి నీ సతిని గారవింపక వదలి తుదకు గర్భిణియగు కనకాంగిఁ గోల్పోయి, యింకయు నెఱుక వహింపలేక లీలావతియె నీ హృదయేశ్వరి యనియు, దుర్బుద్ధియె

నీకుం గూర్చు నెయ్యుఁ డనియుఁ దలఁచుచున్నాఁడవు. నా పాపవశంబున నే నెఱింగిన యంశములు నీకు విదితంబు లయ్యె నేని వారిం గొఱుతఁ దగిలించి నీ సేఁతలకు కోసి నాలిక గుంజుకొని చత్తువు. కొండొక కారణంబున నీతోడ మన సిచ్చి పలుకలేను. కాలాంతరమున నిక్కము తేలును; లీలావతీదుర్బుద్ధులదౌష్ట్యము తెల్లమగును. నా నుడుల మఱవకుము. వారి నిఁక నమ్మకుము. దీని వ్రాసినవారిఁ గని పెట్టఁ దివురకుము. కని పెట్ట లేవు."

ఇ దెట్టి యాశ్చర్యము! ఇది యాఁడుదానివ్రాతగ నున్నది. ఇట్లు వ్రాసినవా రెవరో తెలియకున్నది. కనకాంగి మరణంబునకును లీలావతీదుర్బుద్ధులను నేను గారవించుటకును సంబంధ మేమి? ఈ లేఖ వీరల నమ్మవలదని నాకుఁ దెలుపుచున్నది.

* * * * * * *

కనకాంగిని నేను గారవింపమి నిక్కము. కులసతిని గారవింప నేల? అమ్మగువ నెందును గొదవ లేకయుంచితిని. అది నాయం దెన్నఁడును గినిసిన జాడలేదు. అట్లున్న నే నెఱుఁగనా? విజయుఁ డొక్కఁ డప్పు

డప్పుడు "లీలావతినిఁదొఱఁగి నీసతిం గూడి యానం దింపు" మని పలుకువాఁడు. కనకాంగి నలక్ష్యపెట్టితి నని యిట్లు పలుకువాఁడు. అ ట్లెప్పుడును నేను నడ చుకొనలేదు. అది నాపట్టమహిషికదా! నా వెనుక నీ రాజ్య మేలఁ గల్గు పుత్రకుఁడు దాని గర్భమునఁ గలఁడుగదా యని తలఁచువాఁడ. అది హఠాత్తుగ నట్లు మరణమొందినది. నా కెంతయో సంతాపకర మయ్యె. కనకాంగి సుగుణధన్యయని నే నెఱుఁగనా? సుందరియగు లీలావతితో నెక్కింత యానందించిన నేమి?.........లీలావతిని నమ్మవలదని యీ జాబు తెలుపుచున్నది. లీలావతి నేల నమ్మరాదు? కనకాంగి మరణంబున—ఔరా! ఏమి తలంచితి? లీలా వతి యట్టిదియా? దాని మన స్సిట్టిదని యింతవఱ కెఱుంగనా? అది నిన్న మొన్న వచ్చినట్టిదియా? అది యాటచేడియయె యయ్యుఁ గాని పనికిఁ బొలుపడ దు.........దుర్బుద్ధి నేల నమ్మఁదగదు? పేరున దుర్బుద్ధియయ్యు నతఁడు చర్యలసుబుద్ధిగనె కనుపట్టు వాఁడు. అతఁడు నాకుం గూర్చుసఖుఁడు. ఇది యెవరో నలయునని నా మనముఁ గలఁప వ్రాసి యున్నారు...

ఆరోగ్యమున నుండినకనకాంగి యున్నట్టు చచ్చుట యాశ్చర్యముగ నున్నది. ఐనం గర్భిణులు వేసటం బడలి వేఱొక కారణము లేకయె చచ్చుటయు విని యున్నారము.

[భటుని ప్రవేశము.]

భటుఁడు—రాజపురందరా! జోహారులు. దుర్బుద్ధి తమ దర్శనార్థంబు వచ్చి..........................

మదన—రమ్మనుము, రమ్మనుము. ఏల నిరోధించితివి? (తనలో) వీనికీజాబుఁ జూపెదను. చూపఁ దగునా? చూపిననేమి? నాకు వీనియందుఁ గల్గుగౌరవంబును దెలుప నెవరో యిట్లు వ్రాసియుండుట నిశ్చయమేకదా? వీని సాహాయ్యముననైన దీనిని వ్రాసినవారిఁ గనిపెట్టె దను.

[దుర్బుద్ధి ప్రవేశము.]

దుర్బుద్ధి—మానవేంద్రా! ఇట్లు చింతిల్లకుము. మానవతి యు సుగుణవతియు నగుసతిం బోఁగొంగినవారికి శోకం బు దుస్సహం బగుట నెఱుంగుదు. ఇంత యేల? ప్రజ లెల్లరుఁ జింతాబ్ధి మునింగిరి. ఐనను భగవంతుని కా ర్యంబులకుఁ జింతిల్లఁ దగదు. నేఁ డున్నవాఁడు రేపు

జీవితుం డగుట సంశయము. కర్మానుగుం డగు ప్రాణి కొంతకాల మీలోకంబున మానవకాయంబున బంధితుండయి తత్ఫలంబు లనుభవించి మగుడ నీ తనువు విడనాడి వేఱొండు దేహంబుఁ జొచ్చును. కావున జననమరణంబులకుఁ గలంగనివాఁడె బుధుండనం బరఁగు.

సీ. "మేనితోడనపుట్టు మృత్యువు జనులకు
నెల్లి నేఁడైన నూఱేండ్లకైనఁ
దెల్లంబు మృత్యువు దేహంబు పంచత
నొందఁ గర్మానుగుఁడై శరీరి
మాఱు దేహమునూఁది మఱి తొంటి దేహంబుఁ
బాయును దనపూర్వ భాగ మెత్తి
వేఱొంటిపైఁ బెట్టి వెనుక భాగం బెత్తి
గమనించు తృణజలూకయును బోలె
వెంట వచ్చు కర్మవిసరంబు మును మేలు
కన్న వేళ నరుఁడు గన్న విన్న
తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ
బాడితోడఁ గానఁబడినయట్లు."

అను భాగవతవచనంబులు నీ వెఱుంగవే? ఇట్లు చింతిల్ల నేమి ప్రయోజనము? ఈశ్వరునిమాయ నేర్పఱప నెవ్వ రోపుదురు?

తే-గీ. దుష్టుఁ డిలలోనఁ బెక్కేండ్లు తొలకరించు
నాథ "పాపీ చిరాయువు" నాఁగ వినవె!

మదన—మిత్రమా! అది నిక్కము.

దుర్బుద్ధి—
ఇలను సుజనుండు వైళంబ తలఁగుఁ దనువు
నివి పరాత్పరమాయలం చెఱుఁగవలదె!

నృపసార్వభౌమా! స్త్రీలఁ బోలి నీ విటు దుఃఖింపఁ దగదు. శోకంబునఁ బరితపించువనితల నోదార్చుట దుష్కరము.........రాజేంద్రా! నాఁడు కనకాంగీ దేవి మరణంబు విని లీలావతి యెంత సంతాప మొందెఁ జూచితివా?

మదన—ఔను. చూచితిని. లీలావతి మనస్సు మిక్కిలి మెత్తనిది.

దుర్బుద్ధి—నృపమణీ! ఇది మిక్కిలి చోద్యము. కరుణ వారాంగనలయెడ నసంగతము. మఱియు లీలావతి సవతి మరణంబునకుఁ దపించునన్న.................

మదన—లీలావతి నితరవారకాంతలతోడ సరిపోల్పఁ దగదని యెన్నియోమాఱులు పలికి యున్నాఁడను.

దుర్బుద్ధి—అది నిక్కము. కొందఱు నీచకులంబున జనన

మొందియు సత్కులీనులసుగుణసంపత్తి నలవరించు
కొనుట చోద్యంబని యిట్లాడితిఁగాని వేఱొండుగాదు.

మదన—నెయ్యమా! ఇదె యీ జాబును జూడుము.

దుర్బుద్ధి—(చదివి నవ్వును.)

మదన—దీనిని వ్రాసినవా రెవరో తెలియునా?

దుర్బుద్ధి—(జాబుఁ బరికించుచుఁ దనలో) ఇది యాదుష్ట
రదనిక వ్రాసినది. ఇది దానివ్రాలె. ఇక్కార్యమున
దీనిని నేను సాయము కోరినది బుద్ధిలేనితనము. ఈ
వ్రాలు దెలిసిన ట్లొప్పుకొనుట తగదు. మెల్లన విజ
యునిఁ దగిలించెదను—

మదన—ఏల నీ యభిప్రాయముఁ దెలుపవు? దీని నెవతె
యో పడఁతి వ్రాసిన ట్లున్నది.

దుర్బుద్ధి—(నవ్వి) దుష్టులు తమవ్రాలుఁ గప్పిపుత్తు రనుట
నీకుఁ దెలియదా? ఇట్టి మోసము లోకమునఁ గ్రొ
త్త గాదు. ఇది పురుషునివ్రాలు. లేఖరి నేర్పఱపలేని
యట్టులు వ్రాయఁబడినది.

మదన—ఎవరు వ్రాసియుందురు?

దుర్బుద్ధి—లీలావతికిని నాకును గానివా రెవరో వ్రాసిన ట్లున్నది. విజయుఁడు......................

మదన—దుర్బుద్ధీ! నీయందు నాకుఁ గలుగుగౌరవము స్థిరమై నిలువవలయునని నీ కిచ్చయున్న విజయుని మాట నీ విషయమునఁ దేకుము—

దుర్బుద్ధి—రాజేంద్రా—

మదన—వేగిరపడకుము. నా మాటలను సాంతముగ వినుము. కొన్ని నెలలుగ నీవు నతనికి మైత్రి పొసఁగమి నాకుఁ దెలియ వచ్చె......................

దుర్బుద్ధి—నృపసార్వభౌమా—

మదన—నన్నాటంకపఱపకుము. వినుము. అతఁడు నీ విషయమై నాతోడ నెన్నఁడును బలుకువాఁడు గాఁడు. ఇప్పు డతఁ డేకారణముచేతనో యీ పట్టణము వదలి యెందో పోయెను. ఇదియ యదనని నేటివఱకు నతనిపైఁ గొండెములు చెప్పఁ దొడంగితివి.

దుర్బుద్ధి—నృపమణీ! నే నతని—

మదన—తాల్మిమై నేల వినవు? దీననే నీదుస్స్వభావము తేఁటపడు చున్నది. నే నన్నట్టు లతనిపైఁ గోపింప

నన్నుఁ బురికొల్పఁ జూచితివి. చిఱుతనాటనుండియు నతని స్వభావం బెఱింగినవాఁడఁ గాన నేను నీ మాయ లకుఁ దగులువడ నైతి. నేఁ డన్నిటికి మిన్నగ నీ జాబు నతఁడు వ్రాసియుండునని సూచింపఁ దలపెట్టితివా?

దుర్బుద్ధి—ధరాతలేంద్రా! నా వాక్యశేషంబు వినక నాపైఁ గోపించితివి. విజయుఁ డున్న నతని సాహాయ్య మున నీ లేఖరిఁ గనిపెట్ట నగునంచుఁ బలుకఁ దలఁచితిని గాని వేఱుగాదు. కారణము లేక విజయునిపై నే నేల కొండెములు చెప్పఁ దొడఁగుదు?

[భటుని ప్రవేశము.]

భటుఁడు—వసుమతీశా! సేనానిపరాక్రమవర్మ తమ దర్శ నార్థంబు వేచియున్నాఁడు.

మదన—ఇజాబువిషయ మట్లుండ నిమ్ము. ఏదే నొక ముఖ్య మైన కార్యాలోచనము సేయఁ గోరి పరాక్రమవర్మ వచ్చి యున్నాఁడు. నేఁడు పెందలకడనె వచ్చెదనని యతఁ డు వ్రాసి పంపెఁగాని నేను మఱచితిని. సభకుఁ బోవు దము రమ్ము. (ఇరువురును వెడలుదురు.)

---

# కనకాంగి.

---

చతుర్థాంకము—చతుర్థరంగము.

[లీలావతి శయనగృహము.]

[లీలావతి నిదురించుచుఁ గలవరించును.]

లీలా—పోయెను—పోయెను—కనకాంగిపోయెను. దుర్బుద్ధీ, దుర్బుద్ధీ—నీపట్టు నెఱవేఱెను. పోయెను—పోయెను—నా నెమ్మది పోయెను. ఇంక సుఖమా?—సుఖమా?—ఏమీ? సుఖ మందువా? అ దెక్కడిది? నేనా బుద్ధిలేని దానను? కంటకుఁడవు నీవు. నాకేమి భయము? కత్తిచేఁ దునిమినవానికి భయమా కత్తికి భయమా?... భయమా? ఏమి భయము? ప్రాణమునకుఁ బ్రాణము పోవును. ఇంతియ కదా? మదనుఁడు పిచ్చివాఁడై మనలను నమ్మెనే? దుర్బుద్ధీ! నీవు సార్థకనామధేయుఁడవు. నన్నుఁ జంపుదువా? చంపుము. నీతోడ నింత వఱకు సహవాసము నెఱపిన నాకు.........దూరము పొమ్ము. నన్నంటకుము. సర్వము నిఁక మదనునకుఁ దెలుప నిశ్చయించితిని. మదననృపేంద్రా! మదననృపేంద్రా! (రాజు ప్రవేశించును)

మదననృపేంద్రా! (మదనుఁ డులిక్కిపడి నిలుచును.) మదనునకు నమ్మక ముప్పుడే పోయెను. ఇదె నాతోడ మాటలాడఁడు. మదనావనీధవా!

మదన—లీలావతీ యేమి?

లీలా—ఆ—వినుచున్నావా? దుర్బుద్ధీ! ఎందు డాఁగెదవు. జరిగినది చెప్పక మానను....................

మదన—ప్రియా! ఏమి జరిగెను?

లీలా—దుర్బుద్ధీ! ఏల తిరిగి వచ్చితివి? అయ్యో! ఆ బరణి నేల తెచ్చితివి? దానఁ గనకాంగిని జంపిన విషమున్న దే? నా కిచ్చి చంపుటకుఁ దలంచెదవా? నీ విట్టివాఁడ వని యెఱుఁగ నైతినిరా. వలదు వలదు. దగ్గర రాకుము. అయ్యో వీఁడు పట్టుకొనెనే? పట్టుకొనెనే? మాలతీ! మాలతీ! (అని తడఁబడి నిదురమేల్కనును.)

మదన—లీలావతీ!

(లీలావతి యులికిపడి తెల్లబాఱినమోమున నెట్టకేలకు ననురాగచిహ్నంబులుదాల్చి వణఁకుచేతులతో రాజుం గౌఁగలించుకొని ప్రయత్నముతో నవ్వును.)

లీలా—నృపమణీ! ఇం దెప్పుడు వచ్చితివి?

మదన—నిదురలో నేమో కలవరించుచుంటి వది యేమి?

లీలా—(పెద్దపెట్టున నవ్వుచు) రాజేంద్రా నా కెట్లు తెలి యును? వినియున్న నీవే తెలుపవలయును.

మదన—ఏమో విష మంటివి. కనకాంగినిఁ జంపిన విష మం టివి. దుర్బుద్ధి యావిషమున్న బరణిఁ దెచ్చె నంటివి. నా కేమో తెలుపుదు నంటివి. ఇంతలో నతఁడు నినుఁ బట్టుకొనె నని పెద్దపెట్టున వాపోవుచు నిదుర మే ల్కాంచితివి.

లీలా—ఓ—తెలిసెను. నిన్న నొకమాట నా చెవులఁ బడె ను. దానికై చింతిల్లుచుండి నిదురకుం దొడంగినందున నిట్లు కలవరించితి నేమో!

మదన—అ దెట్టివార్త?

లీలా—రాజపురందరా! దానిని నీకుఁ దెలుపుట యుచి తముకాదు.

మదన—ఎట్లైనఁ దెలుపవలయును.

లీలా—ఇప్పుడె యడఁగుచున్న నీ చింతాగ్ని నింక రగు ల్పనా?

మదన—ఆ భయము వలదు. నా మనస్సు గండశిలం బోలి కఠిన మయ్యె.

లీలా—నిన్ను దుర్బుద్ధి యిచ్చుటకే వచ్చెను. కొందఱు కనకాంగి విషముచేఁ జచ్చెనని పలికెదరఁట. నేనును దుర్బుద్ధియేఁ గూడి యా విషమును గనకాంగి కిచ్చితి నని యొక కొందఱు తలంచెదరఁట. అయ్యో పాప ము. కనకాంగీదేవికి మే మేల విష మియ్యవలయు? ఎవ్వరికిని గీడు దలఁపని యా సాధ్వీమణికి విష మిచ్చు క్రౌర్యము మా కేల రావలయును? అని పలుకుచుం టిమి. నిదురలో నీ తలంపె కలవరింపులుగఁ బరిణ మించియుండును. కల్లము పీడిన గుట్టము మిట్టుపల్ల మెఱుఁగక పాఱునట్లు కలఁతనొందినమనస్సు నిదు రలోఁ బరిపరివితముల మెలంగుట సహజము కదా! (మదనుఁడు విచారగ్రస్తుఁడై పుడమిఁ జూచును.) అవనీధవా! ఏల మిన్నకున్నాఁడవు? నాయందు సంశ యించెదవా? పనిపాటులేక పెఱల దూఱుచుఁ దిరు గాడు దుష్టులమాటలను నమ్మెదవా? లేక మన లీలా వతి యిట్టి కార్యంబుఁ జేయునాయని తలపోసెదవా? రాజేంద్రా నిక్కంబు పలుకుము. ఏమియు దాఁచవల దు......ఏల బదు లాడవు? కనకాంగి మరణంబు నకు నీ హస్తంబు కారణభూతంబయ్యె నేని నిది తెగి

పడుఁ గాక. ఎవ్వారైననేమి యీ క్రూరకృత్యంబునకుఁ బాలుపడిన వారిని శిక్షించుటయె పోలును. నన్ను శం కించితివేనిఁ గారాగృహంబున నిలిపి............

మదన—లీలావతీ! నీవె యిక్కార్యంబు నెఱపితివని తలం పనుగాని యిందు శంక కెడమీయఁ దగినయంశము లనేకము లున్నవని..........................

లీలా—శంక లున్న వానిం దీర్చుకొనుటయె యుత్తమ్మంబు. కనకాంగి విషంబునఁ జచ్చెనను శంకయున్న నాఁడె దాని—

మదన—భయపడకుము. చచ్చినదానివిషయంబున నింత బెదర నేల? నాఁడె వైద్యులచేతఁ గనకాంగి.......

లీలా—కనకాంగి విషంబుచేఁ జచ్చెనని యెఱింగినఁ గార్య మేమి? తె నె విసముఁ దినియుండదా?

మదన—నామనము కలంగెను. పట్టపుదేవిని దుఃఖాబ్ధి ముంచిన నాదుర్వృత్తి కియ్యది ఫలంబు కానోవు. బాల్యంబునుండియు ననుం బెరసి మెలంగిన విజ యుండును నను( బాసిచనెను. అతఁడేమయ్యెనో? ఈ చింతలఁ గుందు నను నోదార్చువార లెవ్వరును లేరు.

లీలా—రాజేంద్రా! బొట్టుగట్టిన పట్టమహిషిం గోలుపోయి పరితపించు నీ చింతలపరిమితి నే నెఱుంగుదు. ఐన వీరవర్యుండవగు నీవు శోకంబు నడంప కుంట శోచ్యంబు. ఈ దుఃఖంబు నిన్న కాదు నన్ను నంటె. నృపుని చింతలు ప్రజలచింతలు గావే? ఐన నీశ్వరునియాజ్ఞకుఁ జింతిల్లుట పోలునే? నాటకసూత్రధారి బొమ్మల సూత్రంబులచేఁ బట్టి రంగంబున చూపఱుల కానందంబు నిగుడ నొక్కింత యార్చి మఱుగుపఱచు నట్టు లీశ్వరుండు జగన్నాటక సూత్రధారియై మనల నీ భువనరంగంబునఁ దనయిచ్ఛకు వచ్చినట్టు లాడించి తీసికొని పోవువాఁడు.

మదన—లీలావతీ! ఇది నిక్కంబెయయ్యుఁ బ్రకృతి జనుల కిది తెలియనియట్లు జ్వరాదికారణంబులఁ గల్పించి తన కార్యంబు నెఱపువాఁడు.

లీలా—కావున "నయ్యో నాభార్య విసమునఁ జచ్చె", "జ్వరమున మరణమొందెఁ", "గాన్పుబడలిక నసువులను వీడె" నని చింతిల్లుట బుద్ధిలేనితనముగాదే?

మదన—నీ మాటలచే నామనంబున కొక్కింత యూఱట కలిగెఁగాని తొల్తటిపగిది నెమ్మి గడింప నోప. కనకాంగి

మరణంబునకు నిక్కంపుఁగారణం బెఱుంగునంత దనుక నీకలఁత వీడదు. ఇక్కార్యంబున నీవును నాకుఁ దోడుపడవలయు..............రాజ్యాంగకార్యం బులకు మంతనంబు సలుప నమాత్యులు సభాస్థలిఁ గూడియుండువేళయయ్యెఁగాన నే నేగెదను. నే నన్న మాటలను మఱవవలదు. కనకాంగి మరణంబునకుఁ గారణం బరయ దొరంకొనుము. నాకుం బ్రాణేశ్వరి వగుటఁ దెలుపుము. (అని వెడలును)

లీలా—(కొంతసేపు మిన్నకుండి యాత్మగతముగ) ఇ క్కార్య మిట్లు పరిణమించునని నాఁడే నాకుఁ దెలి యును. ఆ దుర్బుద్ధిమాటలను విని వేల నైతి. అక్క టా! అయినదానికిఁ జింతించిన ఫలం బెయ్యది? ఇకఁ జేయఁ దగినది యాలోచింపవలయు.

(ఒక్కింత విచారించి.)

తే-గీ. ఎండమావులఁ గన్గొని యినమయూఖ
పాతములఁ గల్గు డప్పిని బాపఁ దగిన
సరసియంచును దలపోసి చనుచు నిక్క
మెఱిఁగి కూలుపాంథునియట్టు లిట్లు చెడితి.

ఆ దుర్బుద్ధిమాట వినినందునఁ గదా యిట్టి పాటు పాటి ల్లె! అక్కటా! అతని నెయ్యం బెంతకు వచ్చెను!

చ. పొదలును సంతసం బనుచు బుద్ధిఁ దలంచి, కటూక్తులన్ భయం
బొదవఁగ నాడి, నన్నకట యొప్పనికార్యముఁ జేయ రేపి, తా
నదయత దౌష్ట్యము ల్నెరపె, నాపద యిప్వర కెచ్చె దాన, నీ
మదనునిచిత్తమిం కెటులు మాఱునొ నాగతి యింక నెట్టులో!

తే-గీ. వలదు వల దని పలికితి; వైభవంబు
లున్నవే చాలు నంటి; నీమన్ననేని
నమ్మఁ దగదంటి; నంతయు వమ్ము లయ్యెఁ;
బంత మక్కట నెఱపె; నాపదలు వచ్చె!

నాకు మే లొనర్చువాని పగిది నిక్కార్యంబు నెఱపి తనతోడ నన్నును బాడుచేసె. నయవచనంబులు విననివానితోడి మైత్రి మన కేల యని వీడక నేను నీ కృత్యంబున కొక్కింత పాలుపడితి. అక్కటా దుర్బుద్ధిచేత నే నిట్టి జంత్రపుబొమ్మ యైనందునఁ గదా యిట్లైతి. అయ్యో! నా మనంబె నాకు శత్రువై పరిణమించె. చేయరాని పనులకు ననుం బెరరేపి నాచే నెరపి యది నేఁ డిట్లు కలంగఁ జొచ్చె! నిదుర లోఁ గలవరింపులు నిండె......అయ్యో నాకు నాటి నుండియు నిద్ర యెక్కడిది? దుర్మంతనంబులకు నస త్కార్యంబులకుఁ బాలుపడని ధన్యాత్ములకు నబ్బు నెమ్మదియు నిద్రయు నింక నా కెట్లు చేకూరు!

కలంగి పలుపోఁకలఁ బోవు హృదయంబు నోదార్ప నొక్కింత కన్నులు మూసినంతన బెడిదంపుఁగలలుఁ గలవరింపులుఁ దండతండంబులై నిండి కనుకూర్కు-ఁ బాపు. దుస్స్వప్నంబుల కులికి కన్నులు దెఱచినంతనె యీ భర్మపాంచాలికలును దమ యంగుళుల ననుఁ జూపి యిదె కంటకియని పలుకునట్లు తోఁచు. ఈ జాలకంబుల వెంటఁ గిఱ్ఱుమని వినవచ్చు గాలి ప్రళయకాల కాలార్భటిచందంబున నెదఁ గలంచు. ముందు జూడక కొఱగామికి సంతసంబునఁ బూనిన నాకు నలువ తగినశిక్ష విధించె. ఏ దండనంబును దీనిం బోలదు. నిక్కంబు మదనునకుఁ దెలిపి విధ్యుక్తంబుగ నను శిక్షింపుమా యని వేఁడుదునా?......

[దుర్బుద్ధి ప్రవేశము.]

దుర్బుద్ధీ!

చ. శిలభము నిప్పునం దుఱికి చచ్చెడు భంగిన ముందు జూడ కా
కులమతి విఱ్ఱవీఁగి యటు కోమలి నిర్దయఁ జంపి యిట్టి స్త్రీ
కలఁతలఁ జావఁగా నకట కాంచితి మార!

దుర్బుద్ధి— భయంబుమైఁ గడుఁ

దలఁకఁగ నేల నీ కిపుడు? ధైర్యముఁ దాల్పుము మేలు వచ్చెడిన్.

లీలా—(కోపముతో)

సీ. తగదురా విడువరా ముగుద రాజసతిరా
తెలియరా వగలురాఁ గలవటంచు,

దుర్బుద్ధి—నీ పురోభివృద్ధిఁ దలపోసి యీ మునిసంచి విప్పి నీవ............

లీలా—

వినవేల కనవేల మన సేల నరపాల
వరుఁ జాలవగపాలఁ బనుప నంచు,

దుర్బుద్ధి—అట్లైన నికార్యంబునకు నీ వేల తోడ్పడితివి? ఇప్పు డేల నన్ను దూఱెదవు.........

లీలా—

పతి నొప్పు సిరి విప్పు వగ పెచ్చు మదిఁ జొప్పు
భయ మెచ్చుఁ గోల వచ్చు వలద టంచు,

దుర్బుద్ధి—స్త్రీల బుద్ధుల నమ్మరాదని యప్పుడె తెలియక పోయెను!

లీలా—

బాలరా గోలరా బేలరా తాళరా
యేలరా కూలరా గెంతి యందు,

దుర్బుద్ధి—భళిభళి! సర్వము నా తలం బెట్టెదవా?

లీలా—

కసుగా చిలికించి నయ మెంచి కండ్ల నీరు
నించి బెదరించి పదరించి యంచితంబుఁ

దెలుప నాలించి కోపించి కలవరించి
మించి నను దూఱినాఁడవు మేల మాడి!

దుర్బుద్ధి—ఔరా! నాకై యీ పని కొడికట్టితివా?

లీలా—ఎవ్వరికై పూనిన నేమి? దుష్కార్యం బెప్పుడు ననాచరణీయంబె కదా! నీ ప్రోత్సాహ బలంబు లేదేని నా మునీశ్వరుని సంచిదరికిఁ బోను. అట్లు పోవనేని నీ ఘాతుకకృత్యంబు ఘటిల్లదు.

దుర్బుద్ధి—కావున నిన్ను నీవే దూఱుకొనుము. నన్నుఁ దూలనాడ నేల?

లీలా—

తే-గీ. మావటీఁ డంకుశంబుచే మదగజంబుఁ
బట్టి తన యిచ్చచొప్పున నడిగ నడపు
పగిది నరవుమై నన్నట్లు పట్టి యిట్టి
పనికిఁ బురికొల్పినాఁడవు పలువ యగుచు.

దుష్టా! ఇఁక నా ముందు నిలువకుము. నీ మోముఁ జూడ నోప. ఇందుఁ దడసితివేని నీ నేరంబుఁ జాటించి నినుం దండితు నొనరించెద. పొమ్ము.

దుర్బుద్ధి—బాపురే నీ విదగ్ధత! ఆ దండనకు నీవుం దగు లువడుట యెఱుంగ వ్రేటు? నీవు నోరు దెఱచితివేని ని న్నూరక విడుతునా? నీవె విసము సంగ్రహించి

తివి. ప్రయోగంబునకును నీవె కారణభూతవు. నే నేమి యెఱుఁగుదు. నా కేమియుఁ దెలియ దని రాజుతో నాడెద. నీ యాటలఁ జూచెద. దానం బాటల్లు ఫలం బనుభవింపుము.

లీలా—(పండ్లు పెటపెటం గొఱికి) కఠినచిత్తా! న న్నేవ రని తలంచితివి? మెత్తని బిత్తరి యని వెఱపించెదవా? ఇదె నీ కట్టిఁడితనంబుల కంత మొనరించెద (అని యొక్క ప్రక్క కొదిఁగి, మూలనున్న కరవాలంబు నందుకొని జళిపించి పైకుఱికి దుర్బుద్ధి బొమ్మున నాటి చంపి యెఱుకమాలి) ఇది యేమి ఖడ్గము రక్తసిక్తంబయ్యెను? వీఁ డెవఁడు? ఆహాహాహా (నవ్వి) వీఁ డెవఁడో నిదురించుచున్నాఁడు..................ఇం దేల నిదురించుచున్నాఁడు? వీఁడు దొంగయై యుండవచ్చును. మాలతిం బిలిచి వీనిని వెడలఁ గొట్టించెద. మాలతీ! మాలతీ! దొంగ! దొంగ. (తెరపడును)

---

# కనకాంగి.

## పంచమాంకము.

### ప్రథమరంగము—అడవి.

[మదనుఁడు రథాధిరూఢుఁడై ప్రవేశించును.]

సారథి—రాజేంద్రా! ఏల యొక్కతీరున నున్నాఁడవు.

మదన—

తే-గీ. భయదమారుతపాతంబు పరిఢవిల్లఁ
గడలి యలలచే ఘూర్ణిల్లి కలఁగ నందు
నడచెడుకలంబు తూఁగాడి బడలి యుఱియు
పోల్కిఁ జింతాబ్ధిఁ గూలు నాబుద్ధి యకట!

ఉ. కొందల మందె నెమ్మనము కోమలి నాకనకాంగిఁ బాయుటన్;
డెందమునందు నెచ్చెను వడిన్ వగ లామరణంబు నెంచ; నా
సుందరిఁ బోలు సాధ్వి నిఁక జూచెద నే యిల నెప్పుడేనియున్!
పందురు మంచుధాత యిటు వ్రాసిన నే మని యేరి దూఱుదున్.

అక్కటా! ఆఱు వత్సరములకుముం దీవనిలో నెడబాసిన యా విజయుఁ డే మయ్యెనో! ఇం దేదుష్ట మృగంబునకు గ్రాస మయ్యెనో! లేక యీ పలుగాకితోడి పనియేమి యని ననుఁదొలంగి యొండొక్క రాజ్యంబున కేగెనో! చిఱుతనాటనుండియు సఖ్యంబు నెఱపిన కారణంబున నతఁ డెన్నియో బుద్ధులు చెప్ప

వాని నన్నింటిఁ బెడచెవులం బెట్టి యిట్టి యిడుమలకుం బాల్పడితి. కనకాంగియో యసువులఁ బాసెను. విజయుఁ డున్న జాడఁ దెలియ దయ్యె. దుష్టబుద్ధి దుర్మరణంబునకుఁ బాల్పడియె. లీలావతి ఘాతుకురాలయి తెలివిఁ బోనాడె. బుద్ధియో శంకాకులితంబయ్యె.........

సారథి—నృపచంద్రమా! కడచినదానికి వగవ నేల ? దుష్టమృగంబులబారిం బడి యంగలార్చుప్రజల రాయిడులఁ బోఁదట్టి నాఖేటఖేలనంబునకుఁ గడంగి యిట్లుత్తలంబునఁ దత్తఱిల్లి కర్తవ్యంబు మఱచు టేటి మగటిమి. అదె చూడు మొకభల్లుకంబు తన నివాసస్థానంబుఁ బోనాడి కదువడి.........ఇదియె సమయము. బాణము వేయుము.

(మదనుఁడు బాణముఁ బ్రయోగించును. భల్లుకము గుఱితప్పి యొక్క— పొదం దూఱును.)

సారథి—భూధవా! గుఱితప్పెను. ఎన్నఁడును లక్ష్యము తప్పని నీ మార్గణము నేఁ డి ట్లగుట చోద్యము.

మదన—సారథీ!

చ. మనము గలంగి తూలఁగను మందముగాదె బలంబు నారయన్ !
వనమృగసంతతుల్ గెడప వంతలఁ గుందుజడు ల్వలంతులే !

జనులకుఁ బ్రీతి సేయు నిటు చయ్యన వచ్చితిఁగాని సంతసం
బొనరఁగ వేఁటకుం జొరఁగ నుత్తల మూడ్చు బలంబునంతయుఙ్.

సారధి—రాజపురందరా! దీనికి డీలువడ నేల? ఇంకఁ గొంత దవ్వరిగితిమేనిఁ గాననమృగంబు లనేకంబులు నీ యమ్ములబారిం బడఁ గలవు. (అని రథము వేగముగ నడపించును.)

మదన—

గీ. విజయుఁ బాసిననాఁడె నాభుజబలంబు
సగము తూలె, నా కనకాంగి జాలి నన్నుఁ
గూల్చి యెడబాసి నంతనె కోలుపోయి
నాఁడఁ దక్క బలంబును నాఁడె యకట!

సారధి—నరేంద్రా! ఇట్లు చింతల కెడ మీయఁ దగదు. ఇవ్వనంబునందంబుఁ గంటివా?

సీ. సుమమరందంబులఁ జూఱ లాడినతేంట్లు
జుమ్మని రొద సల్పుఁ జొక్క యొకటఁ;
బల్లవఖాదియై పరువెక్కి సుస్వరం
బుల మట్టి పరభృతం బలరు నొకటఁ;
బక్వబింబము మెక్కి పదరి పాటలు పాడి
యానందమున శుక మలరు నొకటఁ;
గమలనాళంబులఁ గడుపారఁ గ్రోలి యం
చలు గలకలమునఁ జెలఁగు నొకట;

నౌర యింద్రుని నందనం బనఁగ నొప్పు
నివ్వ నీస్థలి!

మదన— సారథి యెదను నెమ్మి
గల్గినట్టిని కీకాన కాంత మగును;
శోకకృశితాత్మ కేరీతి శోక నించు?

సారథి—

ఉ. చింతలు నిల్చునే, మనము చెందునె కాతియు, లౌర యీవనీ
కాంత సరోవరంబుదరిఁ గాయముఁ జేర్చిన యంత? చూడుమా
పొంత నలక్ బకం బదిగొ పొల్పెసలారఁగ నూఁగు; నాయెడన్
రంతుల మీఱు నంచగమి రమ్యమృణాళములన్ హరింపఁగన్.

మదన—ఇవి నా చింతాయత్తచిత్తంబు నెలయింప నోపవు.

సారథి—

ఉ. అల్లదె చూడు మామృగము హాళిమెయిన్ దన మేను వంచి తా
నల్లన నిట్టునట్టు గని యాఱని భీతిని వేగ దూఁకి సం
ఫుల్లసుమాళి నెంతయును బొల్చెడు కంచెను దాఁటు నౌర! సం।

మదన—
పల్లలితు ల్మదంబునను బాధలుగూర్తురు గాదె దీనికిన్.

సారథి—రాజేంద్రా! నీ కిప్పు డాఖేటఖేలనంబునకు మనం బొప్పమి తెల్ల మయ్యె. పట్టణంబుచాయఁ దిరుగుదమా?

మదన—వలదు వలదు. బహువిధకోలాహలఘూర్ణితం బగుపత్తనంబునకంటె నియ్యడవి నా చింతాకులిత

చిత్తంబునకు నొక్కింత సుఖదాయియై పరఁగుచున్నది.

సారధి—అట్లయ్యు నేల వికాసంబు వహింపవు?

మదన—

తే-గీ. ఎందు నేగిన వచ్చుఁగా యెదయుఁ దోన!
వల దటంచుఁ జింతలఁ బాసి పాఱఁ గలమె!

సారధి—

అధిప మదిలోన ధైర్యంబు నమరఁ దాల్చి
శోకజలరాశిఁ దరియింపఁ జూడు మింక.

(మదనుఁడు నిట్టూర్చును.)

సారధి—

ఉ. కాంచితె రాజ యీవనము క్రసుమోత్తమవాసనాభరో
దంచితగంధవాహపటలాతతభాసురమాచు శారికా
సంచయనాదితంబగుచు సారసబాణుని నందనంబనన్
మించును; నీ విదేల మితిమీఱువగన్ గలఁగంగఁ జెప్పుమా.

మదన—సారధీ! హయంబుల నిరోధింపుము. ఇయ్యది మున్యాశ్రమంబని తోఁచుచున్నది. ఇందే పరమతపోధనుండు మాధవపదారవిందంబులయందు మనంబుఁ జేర్చి శాశ్వతసుఖంబునకుఁ బాల్పడి సమాధి వసించునో! ఎట్టి మహనీయుఁ డంతరాత్మ బంధించి యైహికంబులఁ బోనాడి యాముష్మికంబ గుఱిచేసి సాహి

ప్య సాయుజ్య సారూప్య సాలోక్య ముక్తులం బడయఁ
దపంబు నెఱపునో! ఎట్టి మహాత్ముండు పవనుం బం
ధించి చూడ్కి నిటలంబున సంధించి యోగం బను
సంధించునో! పాదచారినై యియ్యాశ్రమంబున కేగి
యప్పుణ్యాత్ము దర్శించి కృతకృత్యుండ నయ్యెద. నీవా
సహోవరంబుదరి నరదంబు నిలిపి వాజుల సేదదేర్పు
ము (అని రథం బవతరించి యాశ్రమంబుఁ జొచ్చును.
సారథి రథంబుఁ దోలికొని పోవును.)

---

# కనకాంగి.

## పంచమాంకము—ద్వితీయరంగము.

(మున్యాశ్రమము.)

[మదనుఁడు ప్రవేశించును.]

మదన—(తనలో) ఔరా! ఇయ్యాశ్రమం బెంత రమ
ణీయంబు! భువనంబుఁ దొఱంగి దారసుతాదులను
కైతవానందంబులఁ బోనాడి భవజలధిం దరింప నిక్క౦
పుఁ బ్రాపగు కేశవుచరణయుగళంబు హృదయం

బునఁ బొదుకొల్పి నిశ్చలానందంబున నోలలాడు ముని వర్యుల కియ్యెడ హృదయంగమ మాట చోద్యంబె! అక్కటా! రాజ్యంబు లేల? పూజ్య విభవంబు లేల? దాసదాసీజనంబు లేల? భూషణనికరంబు లేల? గజాశ్వంబు లేల? పైఁడి యరదంబు లేల? నిస్తులభర్మచేలంబు లేల? ఇవి నిక్కంపు ముదంబు లీ నేర్చునే?... కనకాంగి గర్భంబున......అక్కటా! ఇంక నదేటి యాస! ఈశ్వరుఁడు నాసేఁతలకు సైఁపక యాసాధ్వి నెడబాపి కట్టిఁడినై న న్నిట్టి దుఃఖాంబుధిఁ గూల్చెఁ గాదె! ఆసతీతిలకంబుమరణంబుఁ దలంపఁ దలంప మనంబు శోకాగ్నిచ్ఛటలఁ బరితపించుంగాదె! అమ్మా నినీమణి మృత్యువదన గహ్వరంబుఁ జొచ్చినందునకుఁ గారణం బింకయు నెఱుంగనైతి. నాఁడు నా కెవరో లిఖించిన వ్రాఁత చందంబుఁ బరికింప శంక యంకురించె. అంత నా లీలావతి నిదురం బదరి కలవరించి యాడినమాటలచే నాశంక యెచ్చిఱఁగఁ జొచ్చె. దుర్బుద్ధి లీలావతిచేత హతుం డగుటయు నా చేడియ తెలివిఁ దొఱంగి సతతంబు కలవరించుచుంటయుఁ జూడ నక్కనకాంగి దుర్మరణంబునకుఁ బాల్పడియె నంచుఁ దోఁచెఢి.

విజయుఁ డున్నఁ బూన్కి నారసి యాసడి యెఱుం
గం దివురు. అతనిం గోలుపోతి. ఇం కెవ్వరి ప్రాపు వేఁ
డుదు! కనకాంగి మరణంబునకుఁ గారణం బెఱిఁగినంత
నేమి ఫలము?

తే-గీ. విసరుగాడ్పుల సుడివడి విన్ను నంటు
తరఁగలఁ గలంగి బెడిదంపుఁ గరణి మ్రోగు
కడలిఁ దూఁగాడియును ముప్పు గనక గట్టుఁ
జేరుపడవ నాఁ గనకాంగి చేరె దివము!

ఇంక వగవం బనిలేదు... అక్కటా! చింతఁబోనాడ...
అది యేమి యియ్యాశ్రమంబునఁ జేడియలయాలా
పంబులు వినవచ్చెడి. ఈ పొదరింట డాఁగి యాలిం
చెద. (అని దాఁగును. అంత మునికన్యకలు విరులచే
నిండిన పుట్టికలఁ గొనివచ్చెదరు.)

మాధవి—భద్ర! అక్కాంత దురంతచింతాక్రాంతం
బగు స్వాంతంబుఁ జిక్కం బట్టనేరక యెంత పరిత
పించునో చూచితివా?

భద్ర—మాధవీ! పతిం బాసి పొగులుముగుద నోదార్ప
నెవ్వరి తరము. మునీశ్వరుం డెంత బుజ్జగించిన నా పరి
తాపంబు దీఱునదియా?

మాధ—ఔదార్య నౌదార్య శోకంబు పెచ్చుపెరుఁగుం
గాని తఱుఁగ నోపునే?

భద్ర—అమ్మానవతి కా బాలునియందుం గల్గు గారా
బంబుఁ గాంచితివా?

మాధ—అం దచ్చెరు వేమి? తన నోముల ఫలంబై యు
ద్భవిల్లి తేజోవంతుఁడును, సర్వలక్షణ సంపన్నుఁడునై
చెలువారు పుత్రకుం గాంచిన నే తల్లికిఁ బ్రేమ పెరుఁ
గదు?

భద్ర—అది నిక్కంబు. అబ్బాలుఁడు చెంతనున్న మనకును
మనం బుప్పొంగుచుండఁ దల్లి కనురాగంబు వెల్లివిరి
యదా?

మాధ—అర్చనాయోగ్యంబులగు కుసుమంబు లిన్ని చిదిమితి
మివి చాలవా?

భద్ర—చాలుఁ జాలు. బాలకుఁ డింకయు రాక తడసెనేల?

మాధ—ఇప్పుడు వచ్చువేళ యయ్యెఁ బోవుదము రమ్ము.

భద్ర—అబ్బుడుతని కీవేఁటలయం దెంత యానందము!

మాధ—సింహకిశోరం బేనికగున్నలపై వెడలుట చో
ద్యమా? క్షత్రియరక్తంబు సాహసంబులకు వెను
దీయునా?

భద్ర—అదె బాలునియలుంగు వినవచ్చుచున్నది. ఆ విజ యున కా బాలునిపై నెంతమచ్చికయో కాంచితివా?

మద—(తనలో) ఇదివఱ కేమో యని యుంటిని. విజ యుఁడా? విజయుఁ డిం దుండునా? ఈ బాలుఁ డెవఁడై యుండును? వీనిపై నీతనికి................

భద్ర—మాధవీ! ఇదె కనకాంగియు మనదరికి వచ్చు చున్నది.

మద—(తనలో) కనకాంగియా? కనకాంగియా? కనకాంగి బ్రతికి యున్నదా?

మాధ—(పెద్దపెట్టున) బాలకా! ప్రతాపసేనా!

[ప్రతాపసేనుఁడు ప్రవేశించును.]

ప్రతా—అమ్మా! మాధవీ! ఇదె వచ్చుచున్నాఁడను. నేను దెచ్చిన వానినిఁ జూడుము.

భద్ర—బాలకా! నీ వింతవఱకు రాక తామసించుటకుఁ గుందు తల్లిచింతల గణింపక.........

ప్రతా—అమ్మా! కినియకుము. ఇదె చూచితివా యీ జింక పిల్లను? ఇది యొక పొదరు దాఁటుచుండ విజయునిచేఁ బడెను. అమ్మ యేదీ?

భద్ర—అదె వచ్చుచున్నది చూడుము.

మద—(తనలో) అ దెవరో చూతము. బాలకునిఁ గాఁగి లించుకొన బుద్ధి పొడముచున్నది కాని వీని తల్లిం దిలకింతము.

[కనకాంగి ప్రవేశించును.]

కన—బాలకా! వచ్చితివా? ఇంతవఱ కేమి చేసితివిరా?

మద—(ఆశ్చ్చపడి తనలో) ఇది యేమి? మరణ మొందిన కనకాంగి పునర్జీవిత యయ్యెనా?.........ముం దేగి నిక్కంబుఁ గని పెట్టుదునా? హృదయమా! యొక్కింత తాళుము. పదరకుము. ఆహా! కుడికన్నదరుచున్నది! ఇది మంచి శకునము. ఫలము చూతము. ఈతఁ డెవఁడు వల్కలధారియై వచ్చుచున్నాఁడు?

(విజయుఁడు వచ్చి కనకాంగి కెఱఁగి నిలుచును.)

ప్రతా—విజయా! ఆ సింహకిశోరంబుఁ దల్లికిఁ జూపుము.

విజ—బాలకా! నీకుఁబట్టువడిన యా సింగము.......

ప్రతా—ఏమి విడిచిపెట్టితివా?

విజ—లేదు. అది నన్నుం గని నటలు తూఁగాడఁ బైకుఱుకఁ దివురఁ నీవాచెట్టునకుఁ గట్టినకట్టు విప్ప వెఱచి యిటు వచ్చితిని.

ప్రతా—నీశౌర్య మింతయే కదా! నేను బట్టి తెచ్చెదను జూడుము (అని వెడలుటకుఁ దిరుగును. కనకాంగి చేరఁ దిగిచి కౌఁగిలించికొని ముద్దాడును.)

మద—(తనలో) ఇంక నిం దుండ లేను. అతఁడు విజయుఁడు. అది కనకాంగియే. ఈ బాలుఁడు...............

(బయటికివచ్చి ప్రకాశముగ)

కనకాంగీ! విజయా! (అని డగుత్తికతోఁ బలికి మూర్ఛితుం డగును. కనకాంగియు మూర్ఛ నొందును.)

[మునివరుఁడు ప్రవేశించును.]

ముని—మాధవీ! ఇది యేమి? ఆహా మదనుఁడా! ఇది యెవరు? కనకాంగియా? (వారిపైఁ గమండలూదకం బుఁ జల్లును. వారు కదలుదురు.)

ప్రతా—

తే-గీ. తాత! దుష్టుఁ డీతఁడు తల్లి తల్లడిల్ల
నీ పాదమునుండి వెలువడి యిట్లు వచ్చి
కూల నమ్మయు భీతిచేఁ దూలెఁ బుడమి;
వీని నాముల్కిగమిచేత వెడల నడతు.

(అని కార్ముకంబు సజ్యంబు చేయును.)

ముని—(నివారించుచు) బాలకా! వేగిరపడకుము.

మదన—(లేచి నలుగడలఁ గాంచి.)

చ. ఎదిరిబలంబు మాపఁగ నహీనగతిన్ బటుశౌర్యమారఁగన్
గదనపుఁగ్రీడలన్ మరఁగి కార్ముకమున్ వడి నెక్కువెట్టి సం
మ్మదమునఁ డంకృతి స్నెఱపుమందరధైర్యనిపోల్కి నెవ్వఁ డే
పొదవ శరాసనంబు నిటు లోపెను సజ్యమొనర్చ బాపురే!

(కనకాంగి లేచి సిగ్గున నొకచెంత నిలుచును.)

మదన—కనకాంగీ! కనకాంగీ,—అయ్యో! కనకాంగియా? నాకనకాంగియా?—ఇది యేమి నాకన్నులను నమ్మలేను. ఈ బాలుఁడు—ఈ బాలుఁడు—నీ వెవఁడవు?—విజయుఁడవా? విజయుఁడిం దెందున్నవాఁడు!—విజయా! విజయా—మునిచంద్రమా! ఈ బుడుతఁడు.........

ముని—(స్మేరాననుండై)

తే-గీ. ఈ మదనసుకుమారుఁ డహీనబలుఁడు
తండ్రిఁ బోలిన తుంటరి!

మదన— తలప నితని
యందు వాత్సల్య ముబ్బెడు!

ముని— సలుపు నీవు
మాకుఁ గాంచిన నానందమార ద్రొక్కు!

మదన—విజయా! నీవును నన్నుఁ గలంచెదవా?

విజయు—మదనావనీధవా! ఇక్ష్వాకురాణ్ణందనుం డాడిన

పల్కులు నిక్కంబు.

మదన—కనకాంగీ! నీవు నిక్కముగఁ గనకాంగివా?

(కనకాంగి కన్నుల నీరు నించి మదనుని కాళ్లం బడును.)

ప్రతా—అమ్మా! ఇతఁ డెవఁడు?

కనకాంగి—

చ. జనకుఁడు నీకు, నాకుఁ బతి, సంతస మారఁగఁ గౌఁగలించి ని
న్ననయముఁ బ్రోచుఁ గ కితఁడు

విజయ— హారి గుణాన్వితు నీదు బాలు నీ
కని దరిఁ జేర్చితో మైలమి ధారుణి నీతనిఁ బోలువాని నెం
దును వెదకం గనుంగొనఁగ దుర్లభ మయ్యెడు మానవేశ్వరా!

(అని మదనుని చరణంబుల పయిం బడును.)

(ఒక్క యెఱుకు ప్రవేశించును.)

ఎఱుకు—జడదారీ! అల్లదె చూపట్టు గుబురుదాఁపునఁ గల కొలనిలో నొక్క చెలువ పడి మునింగెను. నే నొక్కచెవులపిల్లిం దవిలి యా పొదరుఁ జొచ్చు తఱి గుభాలను నొక్క చప్పుడు విని యా కొలను దరికిం బోయి చూడ మిక్కిలి చిక్కిన యొక్కనాతి యందుఁ బడి మునుంగం గంటిని. అంత నా నీటం దుమికి యా చానఁ బట్టి యొడ్డున కీడ్చు నన్నాబిడకని మాటలాడనోరు రాక తన యొడినున్న యీ జాబును

నా చేతి కిచ్చి నీల్గెను. చదువలేమి నిదె దీనిం దమకు జూపఁ దెచ్చితిని. ఇం దే మున్నదియో చూడుఁడు. (అని జాబు నిచ్చును.)

ముని—(జాబును విప్పి చదువును) "మదనావనీధవా! మున్నొకపరి నేనునీ కొక్క జాబువ్రాసియున్న దానను. కనకాంగి మృతినొందెనని తలపోసియు నా సతి మరణంబునకు నా పాడుచేయి ముఖ్యకారణంబని తలంచియు నట్లు సందిగ్ధముగ లిఖించితిని. దుర్బుద్ధి మరణంబును లీలావతి మతిఁ దొలఁగుటయును వింటిని........."

మదన—మునీంద్రా! ఇఁకఁ జదువ నేల?

ముని—ఇం దొక కొన్ని యక్కరములు తెలియ వయ్యె.

మదన—నీటం దడిసినందునఁ దుడుపుపడియె నోటు.

ముని—అట్లే యున్నది. సరి, వెనుకఁ జదివెదను. (చదువును.)

"తన యింటికివచ్చిన యొకానొక మునిసంచి విప్పి దానియం దుండిన విషము గ్రహించి లీలావతి దుర్బుద్ధి కిచ్చెను. అతఁడు దా—నిని—నా—చేతికిచ్చెను. నేను—ధ—న—ము............"

ఇక్కడ నొక్క తుడుపు. అనేకాక్షరములు పోయినవి.

మదన—అవి విడిచి వెనుకఁ జదువుఁడు.

ముని—(చదువును.) "అంతఁ గనకాంగి కదలెను—కదలఁగా నులికి పాత్రములో నా విసము పోసి......దుష్బుద్ధి యదలించెను. పాఱివచ్చి యీ యడవిలో బడలితిని. సాధ్విని జంపుటయు........భయముచే దినదినము చిక్కి చేయునది లేక వెక్కి వెక్కి యేడ్చుచు నాకలములు దిని కాలము గడపితిని. నేఁడు కనకాంగి నా దౌష్ట్యమునకు న్నిగిలి బ్రతికియుండుటం గంటిని. కుఱ్ఱవాఁ డొకఁడు......చూచితిని. ఇది నీకుం దెలుప నీజాబు వ్రాసి"

ఇది యేమి జా బింతటితో నిలిచెను?

విజ—ఇఁక నంతయుఁ దెలిసియున్నది. ఇదియె మాలతి చెప్పినట్టి రదనికయై యుండును.

మదన—రదనిక—రదనికయా? అది లీలావతి నెచ్చెలిగదా?

విజ—కనకాంగీదేవిం జంపుటకై లీలావతీదుష్బుద్ధులకు సాయ మొనర్పఁ జేరినదియ యా రదనిక.

మదన—అక్కటా! తుదకు రదనికయా కనకాంగికి విసము పెట్టె?

ముని—సావధానముగ నీ వీ జాబును వినమిఁ దెల్లమయ్యె. నీ వ్రెక్కపరిఁ జనువుకొనుము. (అని జాబును మదనున కిచ్చును.)

మదన— (చదివి) ఔరా! లీలావతియు దుర్బుద్ధియు నిట్టి వారా? ఈ వ్రాఁత......ఏమో....చూచియున్నాఁడను. ఆ—తెలిసెను. ఆ వ్రాలే. సందేహము లేదు. తాను మున్ను నాకు వ్రాసినట్టును దెలుపుచున్నది కదా? ఇంక సందేహ మేల? విజయా మరణమొందిన కనకాంగి బ్రదుకు టెట్లు?

విజయు—ఇమ్మహాత్ము నడుగుము.

కనకాంగి—

చ. ఇన్ని దినంబు లీజటికులేంద్రుఁడు కూరిమిఁ బ్రోచె నన్ను నీ
చిన్ని కుమారు.

మదను— మానికులశేఖర నా కివి యద్భుతంబు ల

య్యె న్నిజ మానతిం; డకట యీ కనకాంగిని మీరుగాచు టె
ట్లన్నియుఁ దెల్పుఁ డీ హృదయ మంగదఁ దూలి కలంగె సంయమీ!

ముని—లీలావతికిం జేపడినది నా సంచియ. అందు విషములు లేవు. లీలావతి సేకరించినద్రుతము భుజించిన వారికిఁ దెనుమూర్ఛ గల్పించును. దాని సేవనమున

నాడి యడఁగును. సర్వావయవంబులును జలనంబు దక్కి- సోలునవి—ఇంత యేల? అందలి మూలికల ప్రభావమున మరణచిహ్నము లన్నియుఁ జూపట్టునవి.

మదన—అట్లైన బ్రతికియున్న కనకాంగినా శ్మశాన వాటిఁ జితం బెట్టఁ బనిచితి?

ముని—నీవు లీలావతి మాయావాగురం దవిలియుండుట నెఱుక లేక దహనకృత్యంబునకు దుర్బుద్ధి నాజ్ఞాపించితివి. అతఁడా మూలికల స్వభావం బెఱుంగమిఁ జచ్చిన కుక్కలను బడవైచునట్లు కనకాంగి నీ యడవిం దిగ నాడఁ దన సేవకుల కాజ్ఞ యిచ్చెను. వారును గడు దవ్వరుగక నీ పట్టణోపాంత కాననంబున......

మదన—వారట్లు సేయ రేనిఁ గనకాంగి బ్రతికియుండునా?

ముని—కనకాంగి యెట్లును జచ్చియుండదు. నీ పట్టణము నుండి యీ కనకాంగిని మోఁచుకొని వచ్చు వారి వెంట నె వికృత వేషులమై నేనును వివిధాయుధపాణులగు విజయుఁడును మఱి కొందఱు నా శిష్యులును కయ్యమునకేనిఁ దెగి.........

మదన—అట్లైల............

ముని—వినుము. ఎల్లర నోర్చి కనకాంగిని విడిపించుటకు సన్నద్ధులమై యుంటిమి. ఎట్లైన నేమి, దుర్బుద్ధి సేవకులు చలనములేని కనకాంగి నడివిం దిగవిడిచి యేగం గని యొక్క దివ్యౌషధంబున నామూర్ఛ పోఁదట్టి యియ్యా శ్రమంబునకు నీసాధ్విం దోడ్తెచ్చితిని.

మదన—మునిరాణ్మండనా.........

విజ—ఇటులి మ్మునికన్యకలు తనకుం బరిచర్యలు సేయ ని మ్మానినీమణి యీ యసమాన శేముషీవిభవుండగు బాలునిం గనెను.

ప్రతా—విజయా! నేను దాతవలన ధనుర్విద్యం గఱచి నది యేల తెలుపవు?

మదన—బాలకా! సమస్తమును దెలియనయ్యెను. నన్నుం గౌఁగలించుకొనుము. కనకాంగీ! నా దరికి రమ్ము. (ఇరువురం దరిఁ జేర్చి పరిరంభణసుఖం బభినయించి) మునీంద్రా! నాకేల యీ నడి తెలిపి నాకొండలంబు మాన్పవైతిరి?

ముని—చిరకాలంబుగ నభ్యస్తముకాని శిష్టాచారము నీకుఁ గుదురుకొనువఱకు కనకాంగి నిందె నిలుపం దలంచితి.

మదన—

క. ఏమని కొనియాడుదు మి
మ్మో మునికులమండన! పురుషోత్తముఁ డెలమిన్
మీ మదిఁ గరుణఁ గణింపఁగ
భామామణి బ్రదికె నాదువంత లడంగెన్.

విజయా! నీ వెట్లిందుఁ జేరితివి? నా కేమియు బోధపడమి మనంబు పదుటం బడదయ్యె.

విజయ—రాజేంద్రా! ఆశ్రమంబునఁ గుటీరంబుఁ జేరి నీ కంతయు సాంతముగఁ దెలిపెదను......

ముని—రాజేంద్రా! కనకాంగీ సంరక్షణంబున నితఁడె నను బురికొల్పె. ఇట్టి యమాత్యుఁడు నీకిం కొకఁడు లేఁడు సుమా.

మదన—అది తెలియక కదా దుర్బుద్ధిని నమ్మి చేలనైతి!

ముని—కడచినదానికి వగవనేల? ఇదె నీ సతీసుతులు నిన్నుం జేరిరి. ఇట్లు నీకు శుభమాపాదించిన శ్రీనాథుం గొనియాడుదము.

అందఱును—(పాడుదురు.)

శంకరాభరణము—రూపకతాళము.

## పల్లవి.

సరి। సానీ॥ సరి। గారీ॥ పమ। గారీ॥ పని। సాసా॥

సుర। రక్షా॥ ముర। శిక్షా॥ నర। పక్షా॥ వర। దాఅ॥

## అనుపల్లవి.

పప। పాధప॥ మగ। మాపమ॥ గరి। గామప॥ మగ। రీరీ॥

కరు। ణింపవె॥ కరి। వందిత॥ చర। ణాంబుజ॥ విభ। వాఅ॥

## చరణములు.

ముని—

1. భవ। మోచన॥ భవ। సారస॥ భవ। సన్నుత॥ చర। ణాఅ॥

2. దివి। జారివి॥ భవ। శోషణ॥ కవి। సంస్తుత॥ చరి। తాఅ॥

మదన—

3. నత। వారము॥ నుతి। సేయఁగ॥ గతి। నీవని॥ విత। తాఅ॥

4. ద్భుత। వైఖరి॥ వెతఁ। బాపని॥ విత। మూనఁగఁ॥ దగు। నాఅ॥

కనకాంగి—

5. నిను। నమ్మితి॥ వన। జోదర॥ నను। వీడఁగఁ॥ దగు। నాఅ॥

6. అను। వొందఁగ॥ ననుఁ। బ్రోవుము॥ ముని। వందిత॥ సుగు। ణాఁ

అందఱును:—

సుర। రక్షా॥ ముర। శిక్షా॥ నర। పక్షా॥ వర। దాఅ॥

కరు। ణింపవె॥ కరి। వందిత॥ చరణాంబుజ। విభ। వాఅ॥

ముని—

సీ. విక్టోరియాభిఖ్య వెలయంగఁ గాంచిన
యంబకు విజయాప్తి యబ్బురంబె
తెలిదీవిఁ బాలించుదీనిధికిని సిత
యశమును గాంచుట యబ్బురంబె
కడుపార బిడ్డలఁ గన్నకుటుంబిని
కాశ్రితరక్షణ మబ్బురంబె
ఈర్ష్యచోదితవృత్తి ననువొంద మహి నేలు
నలమాత కును ధైర్య మబ్బురంబె
ప్రజల కెల్లరకును సుఖప్రాప్తి గలుగ
వైరు లెల్లను మూలలఁ బదరి యొదుఁగ
నలరి భువనంబుఁ బ్రాభవం బమర నేలు
నట్టివిక్టోర్య శ్రీనాథుఁ డమరఁ బ్రోచు.

మదన—

సీ. తనవారికిని హిందుజనులకు భేదంబు
లేకుండ మనలఁ బాలింతు ననియెఁ
దనవారు మనవారు ననువొంద నెయ్యమై
యొనరఁ బోలునటంచుఁ దనరఁ బలికెఁ
దనవారు మనవారుఁ దనివొంద రాజకీ
యాధికారము లంద నందుఁ డనియె

మనవంత తనవంత యనియెన్ని మనదుఃఖ
ములఁ బాపుదు నటంచు మొనసి తెలిపె
నాత్మజులఁ బ్రీతి మైఁ జూచి యనవరతము
మోద మందెడు తల్లినా నాదరించి
మనల నేలుచు సత్కీర్తు లొనరఁ గాంచు
నట్టివిక్టోర్య శ్రీనాథుఁ డమరఁ బ్రోచు.

విజయు—

సీ. కుంటివారును బుట్టుగ్రుడ్డివారును గూడ
సర్వత్ర చన నయశ్శకట మొదవె
ఖండాంతరములకుఁ గడుకొని యరుగంగఁ
బొగయోడ లెంతయుఁ బొగడ నెగడె
బహువిధవృత్తులఁ బ్రజలెల్ల మనఁ గల్గె
విద్య లెన్నెన్నియో విస్తరిల్లె
ధనవంతులును దీనజను లన్న భేదంబు
లే కెల్లరకు న్యాయ మేక మయ్యె
వెలసె సర్వసమత్వంబు విశ్రుతముగ
నెరసె స్వాతంత్ర్య మెంతయు నెలఁతుకలకు
నెట్టిరాణిదౌపాలన మేపుమీఱ
నట్టివిక్టోర్య శ్రీనాథుఁ డమరఁ బ్రోచు.

[illegible]ంగి—

సీ. క్షామసంక్షుబ్ధులౌ జనుల నెల్లరఁ బ్రోచుఁ
దల్లి గాదే యీమె దయ దలిర్ప!
యోగ్యతఁ గలవారి కుత్తమపదవుల
నొసఁగు నీమెయెగాదె యఖిలసజ్జనాఢ్య!
స్వమతాభిమానంబు సాల గల్గియు నన్య
మతహానిఁ దలఁపదు మాన్య గాదె!
తా దీర్ఘకాలంబు ధాత్రి నేలుచు నోర్మి
ధాత్రినాఁ దనరు వైచిత్రి గాదె!
యీమె సకలగుణాఢ్యయై యీడ్యపుత్ర
పౌత్రులఁ బ్రపౌత్రులను గాంచి భాగ్యగరిమ
వెలయ సర్వార్థసిద్ధినా నలరుచుండు
నట్టివిక్టోరియ శ్రీనాథుఁ డమరఁ బ్రోచు.

మదన—

సీ. అనువొంద మనదేశమును బ్రోవఁ దలఁపోసి
చక్రవర్తిని యీమె సంతసిల్లె;
మనవారి దరిఁ జేర్చి మనుపంగ నెడఁ గోరి
సద్భాషణంబుల సంతరించె;
మన కెంతయును దైన్య లననొప్పు వికటాస్త్ర
లను ద్రుంచి నెమ్మది మనకుఁ గూర్చె;

మన శ్రీకృష్ణదేవగ్రాహ్యమై చేరె మనదు భాషానిల
నంబులఁ జేసెడుడంబు నెరపె;
నహహా యేమందు మనరాజ్ఞియక్కృటికము!
హిందువులు నాంగిలేయులుఁ బొందు గూరి
యుండఁ దగు నంచు నెల్లర కొనరఁ దెలిపె
నట్టివిక్టోర్య శ్రీనాథుఁ డమరఁ బ్రోచు.

గద్యము. ఇది శ్రీమన్నందనందనపదారవిందధ్యానానందమరందాస్వాదన తుందిలేందిందిరాయమానమానస, కౌండిన్యగోత్రపవిత్ర, విబుధవినుతసుచరిత్ర, నవద్వీపవిద్వన్మండలదత్తవిద్యావినోదబిరుదాంకిత, పనప్పాకవంశార్ణవోడురాజ, శ్రీమద్రాయబహదరనంతార్యవర్యపుత్ర, అభినవపండితరాయబిరుదనామధేయభూషి శ్రీమన్నాడభూషివేంకటాచార్యశిష్య, హూణాంధ్రభాషాభ్యాసుకవితోల్లాస శ్రీనివాసాచార్య ప్రణీతంబగు కనకాంగి యనునాటకము సమాప్తము.





Printed at The Vaijayanti Press, Mount Road, Madras.